# "నా కుటుంబానికి తగిన సంపూర్ణ ఆరోగ్య పానీయం."

ఒక్క **కాంప్లాన్**®

## మాత్రమే శరీరానికి కావలసిన 23 అతి ముఖ్యమైన ఆహారాలను సంపూర్ణంగా కలిగి ఉంది.

భోజనానికి తీరిక లేదు...

భోజనం సరిగా చెయ్యడు...

అదనపు పోషణ కావాలి...

అలసటవల్ల తినలేక పోతున్నాను...

ఒక్క కాంప్లాన్ లోనే, బలం, శక్తికోసం ప్రతి రోజూ శరీరానికి కావలసిన ప్రొటీనులు, కార్బోహైడ్రేట్‌లు, ఖనిజ లవణాలు, విటమినులు, ఇతర ముఖ్యమైన ఆహారాలు శాస్త్రీయంగా కూర్చబడిన పాళ్లలో ఉన్నాయి.

గుర్తుంచు కోండి, సంపూర్ణ పోషణ కోసం డాక్టర్లు కాంప్లాన్‌నే ఎక్కువగా సిఫార్సు చేస్తున్నారు.

కాంప్లాన్ సాధారణ రుచిలోనూ, చాకలెట్, ఏలకికాయ-కుంకుమపువ్వు, పిల్లలు ఇష్టపడే స్ట్రాబెర్రీ వంటి కమ్మని రుచుల్లోనూ కూడా లభిస్తుంది!

ప్రొటీన్
కొవ్వు పదార్థాలు
కార్బోహైడ్రేట్
ఫాస్పరస్
పొటాషియమ్
ఐరన్
అయోడిన్
విటమిన్ ఎ
విటమిన్ బి1
రిబోఫ్లావిన్
నికొటినమైడ్
కాల్షియమ్ పాంటొతెనేట్
కోలిన్
పైరిడాక్సిన్ (బి6)
విటమిన్ బి12
విటమిన్ డి

పాలు కలప నవసరం లేదు

Glaxo
Complan®
THE COMPLETE PLANNED FOOD

**కాంప్లాన్** సంపూర్ణ ఆరోగ్య పానీయం

CASGC-38-234 TEL

# లోకంపోకడ — ఊరీమెన్










**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు.
[1938 – 1972]
శుక్రవారం : 15-6-'79
సిద్ధార్థినామ సం. జ్యేష్ఠ బహుళ షష్ఠి
**సంపుటము 72 : సంచిక 40**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

# వారఫలం

15-6-1979 శుక్రవారం మొదలు
21-6-1979 గురువారం వరకు

**మేషం:-** చాలా వారాలుగా ఎదురు చూచిన ద్రవ్యం చేతికి అందుతుంది. ఆనందంగా కాలం వ్యయిస్తారు. వినోద కార్యక్రమాలల్లో పాల్గొనటం తటస్థిస్తుంది. సంతానానికి సుఖ సంతోషాలు ఏర్పడుతాయి: గృహానందం, శుభ కార్యాలోచనలు స్త్రీల విషయంలో ఈ వారం చెప్పవచ్చు.

**వృషభం :** ఎదురు చూచిన ఆహ్వానం అందుకొంటారు. దూరభారమైనా ప్రయాణం చేయక తప్పదు. వ్యయ ప్రయాసలకు ఓర్చుకొంటారు. అందుచేత లాభం ఉంటుంది. వారి ద్వితీయ భాగం గృహ విస్తరణ సంకల్పం ఈ రాశి జాతకులకు కలుగుతుంది. స్త్రీలకు, సర్వ విధాలా ఎట్టి ఇబ్బందులు లేని వారం.

**మిధునం:-** ఈ వారం, రాశినాథుని అను గ్రహం వల్ల, వ్యాపార విషయంలో అను కూలం, బ్యాంకింగ్ వ్యాపారస్తులకు విశే ప్రోత్సాహం ఉంటుంది. కొంత పెద్దలనో, మహాధి పతులనో కలిసికొనుట సంభవం.
స్త్రీలకు :— అనుకున్న ప్రకారం, కార్య క్రమం జరిగిపోతుంది. లాభం వుంటుంది.

**కర్కాటకం:—** లగ్నంలోవున్న గురువు ఇంకా కొంత కాలం ఉంటాడుగా! ఆ కారణం వల్ల ఆరోగ్య భాగ్యం. ఆనందోత్సాహాలకు అంతరాయం ఉండదు. ఆశించింది అలాగే కూడి వస్తుంది. స్త్రీలకు, హాయి, ఆనందం చిక్కుతుంది. ప్రొత్త విషయం తెలిసి కొంటారు.

**సింహం:—** ఇంకా కొంత కాలం ఆరోగ్యం బాగుండవడానికి వీలులేదు. నైసర్గిక గ్రహాల బాధ వుంటుంది. గ్రహ బాధ, వీటలవల్ల మన స్థిమితం చిక్కదు. ఏదో ఒక రాయికాలికి ఎదురు తగులుతుంది. ప్రశాంతత తక్కువ, వారం అశాంతితోనే జరుగుతుంది. స్త్రీలకు చెప్పుకోతగిన అవకాశాలు కూడి వస్తాయనరాదు.

**కన్య:-** గ్రహ బలానుకూలంగల కాలం. ఈ వారం కన్యా లాభదాయకమైన వారం. వారానికొకవారం ఆదాయానందాలలో ఒక అడుగు ముందుకు నడిపించే వారం. గౌరవం కలిగేదినాలు. ఆందోళనకు అవ కాశం లేదు. స్త్రీలకు మంచి దినాలు. లాభదాయకమైనవి.

**తుల:-** వ్యాపారానుకూలమైన మాసం. స్వాస్థ్యలేమిని పరిగణించదు. కృషికి తగిన పారితోషికం లభిస్తుంది. అనుకొనిన విధంగా ఆర్థిక లాభం ఉంది. ఏకాదశ స్థితి రవి, రాహువులవలన ఆర్థికంగా సాంఘికంగా ఉపయోగకరమైనదినాలే. గోచారం బాగుంది. స్త్రీలకు నాల్గు విధాలా సాహిత్య కళా రంగాల్లో జోక్యంగల వారికి లాభదాయకం.

**వృశ్చికం:-** వారం మొదటిమూడు దినాలు అంతగా ప్రకాశమివ్వవు. ఏదో పోగొట్టు కున్నట్లు, ఏదో బాధతో పట మూత పడు తున్నట్లు అనిపిస్తుంది కాని, అంతగా భయపడవలసిన లేదు. నమ్మిన మిత్రులు అపకారం తలపెడతారు. ఇది లోకంలో సహజమని గ్రహిస్తారు. ప్రస్తుతం, ప్రశాంతంగా, ఆనందంగా, కాలం వ్యయం చేస్తారు.

**ధనుస్సు:** మీకు దూరాలోచనలు, దూర ప్రయాణావకాశాలకీ దినాలు మంచివి. అన్ని రంగాల్లో తాప్రత్రయం చూపుతారు. తగిన ఫలం లభిస్తుంది. లాభదాయకమైన వారం. కోర్టు వ్యవహారంలో లాభదాయకం. రాజ్యాంగ విషయాలు మీకు అను కూలం. స్త్రీలకు, సాహిత్య కళా రంగాల్లో లాభదాయకం.

**మకరం:—** మీరు గౌరవించే పరిచయస్తుల్లో, ప్రత్యక్షంగా వ్యతిరేకంగా నిలిచి అపకారం చేయదలచిన వారు, బంధు సర్పములే అని గ్రహించగలుగుతారు. వారం మధ్య కాలం ఆర్థిక ఒత్తిడి కూడా ఉండవచ్చు. స్త్రీలకు కార్యభారం, ఆర్థిక మాంద్యం, మనస్తాపంకు కాలం.

**కుంభం:** ప్రత్యర్థులకు బెడద పోతుంది. అపకారం చేయదలచిన వారు పూరుకుంటారా? ఇక ఆటలు సాగవనటంలో పూరుకుంటారు. డబ్బు చేతికందుతుంది. అనుకూలమైన వాతావరణం ఏర్పడుతుంది. ఆశించిన పనులు నెర వేరుతాయి. స్త్రీలకు అనుకూల వారం. లాభం కద్దు.

**మీనం:—** ప్రతి పనిలో జాప్యం ఏర్పడు తున్నట్లు, అనిపిస్తుంది కాని మీరు లాభం పొందుతారు. ధనం అందుతున్నట్లు చేతికందు తుంది. కాలం కలిసి వచ్చిన వారం అని గ్రహిస్తారు. స్త్రీలకు లాభదాయకమైన దినాలు. ఆర్థికాభివృద్ధికి అనుకూలమైన వారమీ వారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

## ముఖచిత్రం

11.5.79 సంచికపై శోభన్‌బాబు, శ్రీదేవి ముఖ చిత్రం చాల అందంగా ఉంది. ఇన్నాళ్ళకు మా అభిమాన నటుని ముఖ చిత్రం వేసినందుకు చాలా కృతజ్ఞతలు. ఇక పోతే సీరియల్ ఇది ఒక పాంథశాల, జీవిత మాధుర్యం చాలా ఇంటరెస్ట్‌గా సాగిపోతున్నాయి. సందేశంలో వైచేయి, కరుణ కథలు కూడా బాగున్నాయి.

యం. రాజేశ్వరి, రేణుక, నీరజ, సరోజని, (మెట్‌పల్లి).

* * *

నాలు చూపుల సోయగంతో కన్నుల మనోహరంగా సింగారించుకొని తనలోని ఒంపు సొంపులను కళ్ళకు కట్టొచ్చేలా మైమరపును కల్గించేలా చూపిన సంగీత అందాలు సంగీతంలా స్వరాగాలు మీటాయి. సంగీత ముఖ చిత్రాన్ని ఏమని వర్ణించాలో ఎంత వర్ణించినా ఆ అందాన్ని వర్ణించడం కష్టతరమే!

## ఉత్తరాలు

అంతర్యం కథ చదివాను బ్రహ్మాండంగా ఉంది. రాగ రేఖలు నూతన సీరియల్‌నాలో నూతనోత్సాహాన్ని కల్గించింది. మొదటి భాగమే యింత బాగా ఆకర్షించింది. ఇక ముందు ముందు ఇంకెంత బాగుంటుందో! మిగతా భాగాలు చదివితే తప్ప తెలియదు.

కందిగట్ల ప్రభాకర్, నిర్మల, ప్రసన్న, శివశ్రీ (జనగామ).

* * *

25. 5.79 సంచిక సంగీత ముఖచిత్రముతో చాల చూడముచ్చటగా ఉంది. మమ్ములను ఆనంద డోలికలో ముంచి వేసి చూడడానికి చాలా ఆకర్ష ణీయముగా ఉంది.

మీరు ప్రస్తుతము ప్రచురిస్తున్న రాగ రేఖలు సీరియల్ ఎంతో బాగా ఉంది.

ఎస్. వెంకటేశ్వర్లు, ఎ. దామోదరరావు, (ఇల్లందు.)

కథలు

25.5.79న తేదీ సంగీత ముఖ చిత్రంతో వెలువడిన పత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది. కొత్త సీరియల్ ప్రారంభంలోనే మమ్మల్ని ఆకట్టు కుంది. అంతర్యం కథ చాలా బాగుంది. ఈ మధ్య కథలు ఒకటే ప్రచురిస్తున్నారు.

మాధవరావు, అప్పారావు, (వలస)

మంచి సీరియల్స్‌ను వేస్తుంది మీ ఆంధ్ర పత్రిక. 'జీవిత మాధుర్యం' చదవాలేదు. ఇది ఒక పాంథశాల ఆదిలోనే ఆనందం కలిగించింది. ఈ సీరియల్ పాఠకులందరి హృదయాల్లోకి ఎక్కు గలదని విశ్వసిస్తున్నాము.

మద్దా వెంకటరామయ్య, (ఉరవకొండ)

(48 వ పేజీ చూడండి)



# రాగరశ్మి

సీరియల్

మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్



## 8

రామయ్యచేత చిత్రకి కబురు పంపించాడు రమ్మని కృష్ణ తండ్రి చెప్పగా కృష్ణ ఇంటికి వచ్చింది చిత్ర!

'రండి – కూర్చోండి–' ఆప్యాయంగా ఆహ్వానించాడు.

కూర్చుందామె చిత్రని పరిశీలనగా చూశాడు కృష్ణ. ఆమె ముఖం వాడిపోయి, కళ తగ్గి వుంది. కళ్ళు ఉత్సాహాన్ని కోల్పోయాయి. అలంకరణలో కూడా మునుపటంత శ్రద్ధ లేదు.

"ఎందుకో పిల్చారుట?" అంది తల వంచుకునే!

"అవును మీతో మాట్లాడాలని –"

ఏమిటన్నట్లు చూసిందామె

"మీ అమ్మగారి దగ్గర మీకు చేరిక ఎక్కువనుకుంటాను – మీకిది పెద్దషాకే... తల్లి అంతటి అపురూపమైన వస్తువు మరొకటి లేదీ ప్రపంచంలో అందులో ఆడపిల్లకీ వయసులో తల్లి దూరమవడం ... నిజంగా దురదృష్టకరమె."

తల్లిని జ్ఞాపకం చెయ్యగానే ఆమెకి కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి

"క్షమించండి మీ అమ్మగారి ప్రసక్తి తెచ్చి. నేను మిమ్మల్ని బాధిస్తున్నానేమో? కదూ- కానీ, చూడండి. నాకు. అమ్మా-నాన్న – ఇద్దరూ లేరు నాదింకా ఎంత దురదృష్టమో చూశారా? మీకు కనీసం నాన్నయినా వున్నారు! లేని దానిని గుర్తు చేసుకోకుండా – ఉన్నదానిలో సంతృప్తి చెందితే ... మానవుడింకా సుఖవంతుడు కాగలడు. ప్రపంచంలో మనిషికి కావలసిన వాళ్ళెవరో తెలుసా? 'నా' అన్నవాళ్ళు! ముఖ్యంగా తల్లి తండ్రీ! తల్లిదండ్రులకి పిల్లల మీద వున్న అపేక్ష ఇతర్లకు ఎందుకుంటుంది చెప్పండి? తల్లీ తండ్రీ కూడా

*(గత సంచిక తరువాయి)*

లేని పిల్లల్ని 'అనాథలు' అంటారు. కానీ ఎవరో ఒకరైనా వుంటే ఆ పిల్లలు అనాథలు కారు. మీరిప్పుడు అనాథలుకారు. ఆలోచిస్తే నేను అనాథని కదూ?"

కంగారుగా చూసింది చిత్ర! నవ్వాడు కృష్ణ.

"మీకు తండ్రి వున్నారు తల్లి లేనిలోటు ఆయన తీర్చలేక పోయినా, మీకే లోటూ రానియ్యకుండా తన శాయశక్తులా మిమ్మల్ని సుఖపెట్టడానికి ప్రయత్నిస్తారాయన సరే, చూడండి! మీరు మీ వైపునుంచే ఆలోచిస్తున్నారు. మీ నాన్నగారి పరిస్థితి గురించి కూడా ఆలోచించండి! జీవితపు చరమాంకంలో అడుగు పెట్టబోతున్నారాయన! ఈ వయసులో భార్య అవసరం ఎంతో వుంటుంది – నిజానికి! ముఖ్యంగా ఆయన్ని కనిపెట్టుకుని వుండడానికి, ఒక తోడు ఈ వయసులోనే కావల్సింది! కానీ, పాపం ఆయన దురదృష్టం. మీ అమ్మగారు, అదే ఆయన జీవిత సహచరి పోవడం! అదో పెద్దదెబ్బ ఆయనకి! మీరు ఈ సమయంలో చెయ్యవలసిన దేమంటే ఆయన్ని ఓదార్చడం, ఆయనకి ధైర్యం చెప్పడం. అవి మీ వయసుకి మించినవే, అయినా తప్పదు. ఆయన బాధని మీరు అర్థం చేసుకుని, ఆయనని జాగ్రత్తగా చూసుకోవాలి. పెళ్ళయ్యే వరకూ మీకున్న ఒకే ఒక అండ ఆయనేకదా? కష్టానికైనా, సుఖానికైనా, ఆపదలోనైనా, ఆనందంలోనైనా, మీరు నిశ్చింతగా, ఆయన వున్నారనే ధైర్యంతో కాలం గడపవచ్చు!"

---

***జరిగినకథ 3:*** శిల్పకి బెంగుళూరులోని కెనరా బాంక్‌లో ఉద్యోగం రాగా, కృష్ణ అక్కడ చేర్పించటానికి వెళ్తుంటే రైలు కోసం పరుగెడుతున్న చిత్రను చూచి అతని మనస్సు గతంలోకి పరుగెడుతుంది. తల్లి ప్రసవ వేదనలో మరణించగా, తన తండ్రి అయిన వెంకట్రావ్‌ను చిత్ర ద్వేషించటం కృష్ణకు చిత్రంగా తోస్తుంది అవివాహితుడైన తనతో శిల్ప వుంటున్న కారణంగా ఆమెకు వివాహం జరగదేమోనని బాధపడ్తాడు కృష్ణ.

---

"ఇవన్నీ నేను చనువు తీసుకుని చెబుతున్నానని, మీరన్యథా భావించవచ్చు. కానీ, మీనాన్నగారిని ఆ స్థితిలో చూస్తుంటే నాకు చాలా బాధేస్తోంది..." కృష్ణ ఆపాడు.

చిత్ర ఏమీ మాట్లాడలేదు.

"నా మాటలు మీకు బాధ కలిగించి వుంటే క్షమించండి–"

అప్పటికి నోరు విప్పింది చిత్ర. "మీరు నా బాధ అసలు అర్థం చేసుకోలేదు చేసుకోలేరుగూడా..."

"చెప్పండి – అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాను–"

కన్నీళ్ళు తుడుచుకుని చెప్పడం ప్రారంభించింది చిత్ర. "నాది చిన్నప్పటినించీ విచిత్రమైన మనస్తత్వం– మా అమ్మకూడా అదే అనేది. అమ్మా–నాన్నలకి నేను ఒక్కదాన్నే కావడం వల్ల– ఆడింది ఆటగా – పాటగా పెరిగాను కష్టం అంటే–కన్నీళ్ళంటే ఏమిటో కూడా తెలియకుండా పెరిగాను. ఒక్కనాడు కూడా మా అమ్మకానీ– నాన్న కానీ– నన్ను కసురుకునిగానీ– ఒకదెబ్బవేసి గానీ ఎరగరు. నన్ను అంత అపురూపంగా పెంచారు. మొన్న మొన్నటిదాకా నేను మా అమ్మదగ్గరే పడుకునేదాన్ని! అమ్మకు నేను ఎప్పుడూ పసిపాపాయినే! నేను అన్నది జరిగి తీరేది మా ఇంట్లో. నాకిష్టం

లేనిది ఏదీ జరగకూడదు ఆ విధంగా నేను ఎన్నిస్కూళ్ళు మారానో - ఒకదాంట్లో చేరడం—అదిష్టంలేదని ఇంకోటి- అట్లా సాగింది నా చిన్నతనం! ఇంట్లో పనేమీ చేసేదాన్ని కాదు. కానీ నేర్చుకోవాలనిపిస్తే పట్టుబట్టి నేర్చుకునేదాన్నే. డాన్స్ అంటే మా అమ్మకిష్టమైనా - నాకిష్టం లేదు, నేను నేర్చుకోలేదు. సంగీతం నాకు ప్రాణం. అది నేర్చుకున్నాను. అట్లా పదహారు సంవత్సరాలూ గడిచాయి. మా ఇంట్లో నవ్వులేగాని- ఏడుపులులేవు. ఎక్కడికెళ్ళినా మేము ముగ్గురమూ కలిసే వెళ్ళేవాళ్ళం. ఆ రోజు ... ఆ రోజునించే నా జీవితంలో మార్పు వచ్చింది. నాకు చేదు అంటే ఏమిటో తెలిసి వచ్చింది.

అమ్మకి వంట్లో బాగాలేదు. అయినా అట్లాగే పనులు చేసుకుపోతోంది. నాన్నకి బాధనిపించిందో ఏమో, "సుభద్రా, అమ్మాయి చేస్తుందిలే, నువ్వు విశ్రాంతి తీసుకో—" అన్నారు. ఆ మాటకే నా మనసు చివుక్కుమంది. 'నేను చేస్తా'నని అనలేదు. 'అవసరమైతే చేద్దాంలే' అనుకున్నాను. సాయంత్రానికి అన్ని పనులూ చేసి అలసిపోయిన అమ్మ కళ్ళు తిరిగి పడిపోయింది. నాన్న డాక్టరుకి ఫోను చేశారు. డాక్టరు వచ్చి పరీక్ష చేసింది. సంగతి చెప్పింది..." ఆగింది చిత్ర.

ఆమె మనస్తత్వం అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు కృష్ణ, వింటూ!

మళ్ళీ మొదలు పెట్టిందామె. "అదివిన్న అమ్మా-నాన్నలకి ఎట్లా అనిపించిందోగాని, నాకుమాత్రం మనసు జుగుప్సతో ముడుచుకుపోయింది. అసహ్యమేసింది. 'ఛీ-ఛీ ఇప్పుడు, ఈ వయసులో, అమ్మా-నాన్నలకి మళ్ళీ పిల్లలేమిటి? అయినా ఇంత వయసు వచ్చినా ఇంకా చిన్నపిల్లల్లాగ వాళ్ళిద్దరూ ...ఛీ...ఛీ...' పరిపరి విధాల సాగిపోయాయి నాకు ఆలోచనలు. అప్పటినించీ నేను — అమ్మా—నాన్నలతో మామూలుగా వుండలేకపోయాను. వాళ్ళు మాట్లాడుతుంటే కృత్రిమంగానూ అసహజంగానూ అనిపించసాగింది. ముభావంగా వుండసాగాను నేను. అప్పట్నించే అమ్మ దగ్గిర పడుకోవడం మానేశాను. నన్నేదో వంటరితనం ఆవహించినట్లువుండేది. దేంట్లోనూ ఉత్సాహం లేదు. అమ్మ నన్నేదో మాట్లాడించబోతే నేను, సూటిపోటీగా మాట్లాడేదాన్ని. నిష్ఠూరాలు పలికేదాన్ని, తరువాత అమ్మ కళ్ళల్లో నీళ్ళు చూసి, అమ్మ ముఖంలోని రంగులు చూసి. నేను చాలా బాధపడేదాన్ని. కానీ మళ్ళీ 'అవి' తల్చుకుంటే అసహ్యమేసేది. నేనింక ఆ వాతావరణంలో వుండలేక గుంటూరు వెళ్ళిపోయాను. అమ్మావాళ్ళు గూడా ఇల్లు మారి ఈ ఇంటికి వచ్చారు. ఆ తరువాత కొన్నాళ్ళకి నన్ను చూడాలని వుందంటూ మా అమ్మ పిలిపించింది గుంటూర్నించి! అప్పుడే మీ తోట చూడాలంటూ మీ ఇంటికి వచ్చేదాన్ని ...

అమ్మకి నెలలు వస్తున్నకొద్దీ, పెరుగుతున్న అమ్మ కడుపుని చూసి నాలో ఏదో కోపం కలిగేది.

క్రమక్రమంగా నా బాధ ఏమిటో నాకు అర్థమయింది. అమ్మకి నెలలు నిండి ఆడపిల్లో, పిల్లవాడో పుట్టేస్తే, ఇంక ఆ ఇంట్లో నాకున్న స్థానం తగ్గిపోతుంది. నా విలువ తగ్గుతుంది నాకు పోటీ మరొకరు వస్తారు. ఎప్పుడైనా సరే, జీవితంలో నాకు పోటీ మరొకరు వుండకూడదు. అది నాకు ఇష్టంలేదు. నేను భరించలేను.

నేను మళ్ళీ అమ్మ ఎంత బతిమాలినా వినకుండా గుంటూరు వెళ్ళిపోయాను, ఆ తరువాత...ఆ తరువాత...ఏం జరిగిందో... మీకు తెలుసు..."

పదినిమిషాలు నిశబ్దంగా గడిచాయి.

"అయితే...మరి..." అంటూ అడగబోయి-ఆగిపోయాడు కృష్ణ.

"నాన్నంటే నాకెందుకు ఇంకా కోపం— అని మీరు అడిగేది—కదూ? చెబుతాను. అసలు- అసలు-నా ఈ అశాంతికి మూల కారణం—అమ్మ పోవడానికి కారణం నాన్నే కదా? నాన్నేగనక నిగ్రహం చూపివుంటే... అమ్మకి అసలా పరిస్థితి వచ్చి వుండేదా? అమ్మ చనిపోయి వుండేదా...?"

మొహం విరగా చేసుకుని అమాయకంగా ప్రశ్నిస్తున్న చిత్రని చూస్తుంటే నవ్వు వచ్చింది కృష్ణకి.

"పిచ్చి చిత్రా! స్త్రీ పురుషుల మధ్య వున్న పరస్పరాకర్షణ అది! భార్యాభర్తల బంధం అది! మీకిప్పుడ అర్థం కాదు."

చటుక్కున తలవంచుకుంది చిత్ర. ఆమెకిప్పుడు ఆదరణ కావాలి! ఆత్మీయత కావాలి! ఆప్యాయత కావాలి! అవి తనివ్వాలి!



## రాగరేఖలు

మెల్లిగా ఆమె తేరుకునేట్లు చెయ్యాలి! ఇవే కృష్ణ ఆలోచనలు.

ఈలోగా మెల్లిగా లేచి - వెళ్ళొస్తా నంటూ వెళ్ళిపోయింది చిత్ర!

ఆలోచనలలోనే అలాగే వుండిపోయాడు కృష్ణ.

* * *

ఆ తరువాత వీలైనప్పుడల్లా, చిత్రను కలుసుకుని మాట్లాడుతూ వెళ్తున్నాడు కృష్ణ.

చిత్ర కూడా కృష్ణ చెప్పే మాటలు మంత్రముగ్ధలా వినేది

క్రమక్రమంగా చిత్రకి కృష్ణ అంటే అభిమానం పెరిగింది. అతడి మాటలంటే గురి ఏర్పడింది. అతడి దగ్గర చనువు ఏర్పడింది. తండ్రిపట్ల తన స్వభావాన్ని మార్చుకుంది చిత్ర! ఆయన్నిప్పుడు ఎంతో ఆప్యాయంగా చూసుకుంటోంది. కావలసినవి అడగకుండానే అమరుస్తూ, వీలైనప్పుడల్లా కబుర్లు చెబుతూ, ఆయన ఒంటరితనం పోగొట్టడానికి ప్రయత్నిస్తోంది.

ఆయన కూడా భార్యపోయిన దుఃఖాన్ని మర్చిపోలేక పోయినా, కూతురు తన పట్ల ఆత్మీయతను ప్రదర్శిస్తుంటే కాస్త సాంత్వన పొందుతున్నాడు.

కృష్ణకి కృతజ్ఞతలు తెల్పుకున్నాడు.

కృష్ణకికూడా చిత్ర అంటే అభిమానం ప్రేమగా మారింది. అది అధికమవసాగింది.

చిన్న పిల్లలాంటి ఆమె మనస్తత్వం, అతణ్ణెంతో ఆకర్షించింది.

ఆమె దగ్గర కూర్చుని కబుర్లు చెప్పాలనీ, ఆమె విశాల నేత్రాలలోనికి చూస్తూ వుండిపోవాలనీ, ఏవేవో కోరికలు కలిగేవి.

ఒక్క రోజు కూడా ఆమెని చూడకుండా వుండలేక పోతున్నాడు.

* * *

ఆ రోజుల్లోనే కృష్ణకి ఆ ఊళ్ళోనే కాలేజీ లెక్చరర్‌గా ఉద్యోగం వచ్చింది.

చిత్ర కాలేజీలో చేరింది. కానీ- ఇద్దరి కాలేజీలు వేరు-వేరు!

సాయంత్రం కాలేజీనించి రాగానే చిత్ర తన పనులన్నీ గబ గబా ముగించుకుని, తండ్రికి కావలసినవి అందించి, కృష్ణ దగ్గిరికి వచ్చేది. అప్పటికి కృష్ణ కూడా తయారయి ఆమెకోసం ఎదురు చూస్తూ వుండేవాడు.

ఇద్దరూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ వుండేవాళ్ళు ఏవైనా పుస్తకాల గురించి చర్చించుకునేవారు. కృష్ణ మంచి మంచి పుస్తకాలిచ్చి ఆమెని చదవమనేవాడు.

'మంచి పుస్తకాలు చదివి ప్రపంచాన్ని చూస్తే లోకజ్ఞానం వస్తుంది' అనేవాడు.

"ప్రతివిషయాన్ని గాఢంగానే ఒక అభిప్రాయానికి రాగూడదు దానిని తరచి చూచి, దాన్ని గురించి పూర్ణంగా తెలుసుకుని గానీ ఒక అభిప్రాయం ఏర్పరచుకోగూడదు-"

"కొన్నిటికి 'ఆలస్యం అమృతం విషం' అయితే-మరి కొన్నిటికి 'నిదానం ప్రధానం' ఇట్లాంటివన్నీ చెప్పేవాడు.

బుద్ధిమంతురాలిలాగా అన్నీ వినేది చిత్ర. ఒక్కొక్కసారి కలిసి బయట తిరిగి వచ్చేవారు. సినిమాకి వెళ్ళేవారు.

చిత్రకి కూడా అతడి మాటలన్నీ వేదవాక్కులా వుండేవి కృష్ణ సన్నిధిలో సర్వం మరచిపోతోంది. కృష్ణ సాన్నిహిత్యం మధురంగా వుంది. ఉల్లాసంగా వుందామెకి! రోజులు క్షణాలాగా దొర్లిపోతున్నాయి!

చిత్ర తండ్రికిది సంతోషంగా వుంది!

కృష్ణకి కూడా తన జీవితంలోకి వసంతం వచ్చినట్లుంది! తనకి ఊహ తెలిసినప్పటినించీ, ఒంటరితనమే అలవాటయిన కృష్ణకి, చిత్రతోడు వింతో హాయిగా వుంది! అద్భుతంగా వుంది! చిత్రంగా వుంది! ఎప్పుడూ స్తబ్దుగా వుండే తన ఇంట్లో చిత్ర నవ్వులతో కొత్త కళ వచ్చినట్లుంది!

గలగలా మాట్లాడే చిత్ర గొంతుతో తన ఇల్లు కొత్త అందాన్ని సంతరించుకుంది!

వింతో చొరవగా కలిసిపోతున్న చిత్ర ఇల్లంతా చక్కగా సర్ది వుంచేది. ఫ్లవర్ వాజులో పూలు అమర్చేది, కిటికీలకు కర్టెన్లు కట్టేది. తను చేసిన వంటకాలన్నీ కూడా తెచ్చి పెట్టేది కృష్ణకి!

"చిత్రా! ఇల్లెంత అందంగా వుందో తెలుసా ఇప్పుడు? నువ్వో పూట రాకపోతే నాకేం తోచదు. అబ్బ! ఇవాళ కూరెంత బావుందో చిత్రా. నీది అమృత హస్తం!" అని. ఇట్లాంటి మాటలకి పరవశించిపోయేది చిత్ర పొంగిపోయేది" అంటూండేవాడు కృష్ణ.

ఆమెకు కావల్సిందదే చిన్న మాట. హృదయపూర్వకమైన ఆదరణ తను చేసింది మెచ్చుకోవడం.

"చిత్రా. శాశ్వతంగా నిన్నిక్కడే వుంచేసుకోనా?" కొంటెగా నవ్వుతూ అడిగేవాడు చిత్ర కళ్ళల్లోకి చూస్తూ కృష్ణ.

చిత్ర కళ్ళు వాలిపోయేవి బుగ్గలు ఎరుపెక్కేవి. పెదవులు వణికేవి. ముఖం కప్పుకుని అక్కణ్ణించి పారిపోయేది.

కృష్ణ తన మనసుని తాను తెల్సుకున్నాడు. తను చిత్రని ప్రేమిస్తున్నాడు. చిత్ర తనకు కావాలి. తనది కావాలి.

'చిత్ర అంగీకారం కూడా తీసుకుని వెంకట్రావు గార్ని అడిగితే...?' అనుకున్నాడు

* * *

మధురస్మృతులతో మునిగిన కృష్ణని ఎవరో పిలవడంతో బలవంతంగా ఇవతలికి రావలసి వచ్చింది కానీ ఆ మధురస్మృతులు అతడికి మళ్ళీ మనశ్శాంతి నిచ్చాయి. లేచి వెళ్ళాడు కృష్ణ.

## 9

"అబ్బ! వచ్చావా అక్కా. నువ్వు లేకపోతే అసలు నాకేం తోచలేదు తెలుసా?" శిల్ప రాగానే విదురువమూ అంది అర్చన.

"నీకు తోచలేదా? నమ్మమంటావా? దొం...గా!" గలగలా నవ్వింది శిల్ప.

"మీ మామయ్యగారుండగా నీకు తోచకపోవడమేమిటి?" గది తలుపు తాళం తీస్తూ అంది శిల్ప తనే మళ్ళీ.

"మామయ్యా? మామయ్యెప్పుడో వెళ్ళిపోయాడు... అయినా మామయ్యెందుకు? నువ్వు లేని లోటు లోటే..." అంటూ కుర్చీలో కూర్చుంది అర్చన.

"అక్కా-నీమీద నాకు కోపం వచ్చింది" అంది తనే మళ్ళీ అర్చన.

ఆశ్చర్యంగా చూసింది శిల్ప.

"నువ్వెంత హాయిగా వెళ్ళిపోయావు ఎందుకక్కా ఈసారి హైదరాబాద్ వెళ్తే నన్నూ తీసుకెళ్తానని చెప్పావ్?..." మూతి ముడిచింది అర్చన.

"సారీ అర్చూ...మీ మామయ్య వుండగా నిన్నెట్లా రమ్మనను చెప్పు? ఈ సారి ఓ.కే? మా అర్చూ మంచిది!" చెక్కిలి మీటుతూ అంది శిల్ప.

"అర్చనా? రాంగానే ఏ విషయాలేమిటి? శిల్పకి కాస్త మంచి నీళ్ళుగాని కాఫీగాని కావాలేమోనన్నా అడగవా? ఎప్పుడు పోతుందే, నీకింకా చిన్నతనం?..." వైదేహి కాఫీగ్లాసుతో వచ్చి అర్చనని మందలిస్తూ, శిల్పకి గ్లాసందించింది. "ఏమ్మా శిల్పా-బాబాయిగారు బాగున్నారా? ఈ కాఫీ తాగి, కాస్త ముఖం-కాళ్ళు-చేతులు కడుక్కుని, కాస్త విశ్రాంతి తీసుకో. ప్రయాణం చేసి అలిసిపోయి వుంటావు, దీని మాటలకేంలే-" అని వెళ్ళిపోయింది నవ్వుతూ... వైదేహి.

శిల్ప నవ్వుతూ కాఫీ తాగసాగింది.



# రాగ రేఖలు

"మాడు అంటికి నేనంటే వింత ప్రేమో..." అంది.

"అవును. నాకు లేదంటావా? అనుకో అయినా దివరికెక్కువ నువ్వంటే ప్రేమో నీకే తెలుసు-" అంది అర్చన కూర్చున్న చోటునించి లేవకుండానే.

కాఫీ తాగక అర్చనపక్కన కూచుంటూ, "ఊఁ. ఇప్పుడు చెప్పు అసలు సంగతి!" అంది శిల్ప కొంటెగా నవ్వుతూ.

"ఏమిటి— అసలు సంగతేమిటి?"

"అదే అదే... తెలియనట్లు నటించకు. నీ పెళ్ళి సంగతి.?"

"ఏముంది పెళ్ళి సంగతి? ఇప్పుడేం లేదు..."

"ఏం లేదూ? ఏదీ ఇట్లా చూడు. నా దగ్గిర దాపరికమా?"

—అర్చన మాట్లాడలేదు.

"మీ ఇద్దరికీ ఈడూ-జోడూ చాలా బావుంది అర్చూ... మీ మామయ్య అందగాడే..." అంది శిల్ప!

ఈసారీ అర్చనేం మాట్లాడలేదు.

"పేర్లు కూడా కలిశాయి. అర్చన— అరుణ్..."

"... ... ... ..."

"ఫో... అక్కా."

లేచి వెళ్ళిపోయింది అర్చన.

శిల్ప నవ్వుకుంటూ బాత్‌రూమ్‌కేసి దారి తీసింది.

* * *

అర్చన పెళ్ళి అరుణ్‌తో నిశ్చయమైంది. ముహూర్తం కూడా పెట్టుకున్నారు.

ఇంకో రెండు నెలలుంది ముహూర్తం. వివరాలన్నీ శిల్పతో చెప్పింది వైదేహి. ఆవిడకి చాలా ఆనందంగా వుంది. ఒక్కగా నొక్క ఆడపిల్ల పెళ్ళవుతోంది. వరుడూ పరాయివాడు కాదు. ఇంకేం కావాలి? అరుణ్ అందగాడు. ఆస్తి పాస్తి వున్నవాడు. అతడికీ అక్క తప్ప దివరూ లేరు. మంచి ఉద్యోగంలో వున్నాడు. ఆడపిల్ల నివ్వడానికి అర్హతలు చాలు. మళ్ళీ మాట్లాడితే ఎక్కువ కూడా.

పెళ్ళి పనులు ప్రారంభించారు. ఒక టొకటే జరుగుతున్నాయి. పెళ్ళికూతురుకి నగలు చేయించాలని ఒకరోజు ప్రయాణమయ్యారు వైదేహీ నింబంధరావుగారూ పిల్లలతో శిల్పని కూడా రమ్మన్నారు

"నేనెందుకండి అంటే!" అంది శిల్ప.

"అదేమిటమ్మా నువ్వూ మాతో ఒక దానివే. నువ్వేది సెలక్టు చేస్తే అది మా అర్చనకు నచ్చుతుంది" అన్నారు. తప్పలేదు శిల్పకి. వెళ్ళింది.

ఒక నెక్లెసూ— ఒక గొలుసూ—నాలుగు జతల గాజులూ- జూకాలూ సెలక్టు చేశారు. ప్రతిదాంట్లోనూ శిల్ప సలహా తీసుకుంటూనే వున్నారు.

రెండు వెండి కంచాలూ, గ్లాసులూ, వెండి చెంబూ, ఇంకా చాలా కొన్నారు

ఇంటికి తిరిగి వచ్చారు. అప్పటికే చాలా లేటయింది.

ఆ రాత్రి-అర్చన పడుకోడానికి వచ్చినప్పుడు,

శిల్ప అంది హాస్యంగా. "ఇంక రెండు నెలలేగా నా దగ్గిర పడుకునేది"

అర్చన మాట్లాడలేదు.

"ఆ తరువాత రమ్మన్నా— నా దగ్గరికి రావు, కదూ ?"

"............"

"అర్చూ...నిన్నువదిలి నేనుండలేనేమో! పెళ్ళయ్యాక నన్ను మర్చిపోతావా ?"

"అక్కా—" కన్నీళ్ళు పెట్టుకుంది అర్చన. "నిన్ను మర్చిపోతే నన్ను నేను మర్చిపోయినట్లే—" శిల్పకి కన్నీళ్ళొచ్చాయి!

"ఏమిటో అర్చూ...మీ ఇంటికి వచ్చాక నేను తల్లి-తండ్రిలేని అనాథనని మర్చిపోయాను. హాయిగా వున్నాను. నువ్వు నన్ను స్వంత అక్కలాగ, మీ అమ్మగారు-నాన్నగారు, స్వంత కూతురులాగా, ఆదరిస్తున్నారు. నువ్వెళ్ళిపోతే, నువ్వులేని ఈ ఇంట్లో నేనూ వుండలేనేమో, అని పిస్తోంది."

"అక్కా—" అర్చన శిల్పని కౌగిలించుకుని ఏడ్చింది.

ఏదో చెప్పబోయింది ఏడుపు తగ్గాక అర్చన. అంతలో వైదేహి వచ్చింది.

"ఇంకా పడుకోలేదూ ?" అంటూ అక్కడ కూచుంది. తరువాత అవీ యివీ విషయాలు మాట్లాడుకున్నారు ముగ్గురూ, కలిసి. ఆవిడకీ పెళ్ళి అనుకున్నప్పటినించీ రాత్రుళ్ళు నిద్ర పట్టడంలేదు.

(ఇంకా వుంది)



# వంటలు

## మాంగో హల్వా

కావలసినవి :— మామిడిపండ్లు : అర డజను, బియ్యం: అరకేజి, ఏలకులపొడి: 10 గ్రా. జీడిపప్పు: 100 గ్రా. నెయ్యి : పావుకేజి, పంచదార: అరకేజి

మొదట మామిడిపండ్ల రసాన్ని తీసి, ఓ గిన్నెలో వుంచుకోవాలి. బియ్యాన్ని నానబెట్టి మెత్తగా రుబ్బాలి. ఇందులో మామిడిపండ్ల రసాన్ని కలిపి, చక్కెరను తీగపాకం పట్టి, అందులో వేసి బాగా కలియబెట్టాలి దీనిలో వెంటనే నెయ్యిని గూడా వెయ్యాలి. ఏమాత్రం అడుగంటకుండా చిన్న నిప్పు సెగమీద కలుపుతూ వుండాలి పదినిమిషాల తరువాత, వెడల్పాటి పళ్లెంకు నెయ్యి రాసి, అందులో ఈ మిశ్రమాన్ని పర్చి, ఏలకులపొడిని, జీడిపప్పును చల్లాలి. బాగా చల్లారాక తినాలి.

— కె సీతాదేవి

## కొబ్బరి కుర్మా

కావలసినవి :— కొబ్బరికోరు పావుసేరు, శనగపప్పు పావుకేజి, ఉప్పు, ఉల్లిగడ్డలు 4, ఎండు మిర్చి 4, పచ్చి మిర్చి 4 కరివేపాకు కొంచెం, జీలకర్ర టీస్పూను. అవాలు వగైరా పోపు సామానులు— శనగపప్పు 4 గం. సేపు నానబెట్టి, కడిగి ఉప్పు—జీలకర్ర — ఎండుమిర్చి కలిపి ముద్దగా రుబ్బాలి. మెత్తగా రుబ్బిన తరువాత పచ్చిమిర్చి—అల్లం—ఉల్లి ముక్కలా తరిగి ఈ ముక్క, కొబ్బరికోరు ఆ ముద్దతో బాగా కలపాలి. బాణలిలో పోపువేయించి (కరివేపాకుతో) ఉపమా మాదిరిగా పప్పును తగను ఆ ముద్దవేసి కలియబెట్టాలి. తరువాత కొంచెం మానెగాని, నెయ్యిగాని వేసి మూతబెట్టాలి. ఉడిన తరువాత దింపుకోవాలి. ఈ కుర్మా వేడిమీద అన్నంలో కలుపుకుని తినుటకు రుచిగా ఉంటుంది. శనగపప్పు బదులు పెసరపప్పు వాడవచ్చును.

— రమణా ప్రకాష్

జె బి ఆర్ మొలగవల్లి

కాగితాన్ని తొక్కితే చూస్తూ పోతారు. రూపాయి నోటు తొక్కితే నమస్కరిస్తారు. ఇది ఎందుకు?

కాగితం ముక్క కరెన్సీ కాదు కనుక.

రోగం వస్తే డాక్టర్‌తో, చస్తే యమునితో పరిచయం అవుతుంది. మరి దేవునితో అయ్యేది ఎప్పుడు?

బతికినంతకాలం అవుతూనే వుంటుంది కదా దేవునితో పరిచయం. దేవునితో పరిచయంకి రోగమూ రానక్కరలేదు. చావూ రానక్కరలేదు.

ఆర్. ఎస్. కరీంనగరు

నేడు వస్తున్న సినిమాలు నవలలు స్త్రీలపై ఎక్కువ ప్రభావం చూపుతున్నాయంటాను.

స్త్రీలపైనా? స్త్రీలమీదనా— మీరు చెప్పే సినిమాలు, నవలలూ చిత్రింపబడుతున్నదీ—రచింపబడుతున్నదీ. చూడండి, స్త్రీని వస్తువుగా వాడే ఈ నవలలూ సినిమాలూ — స్త్రీలమీద పనిచేయును. అందుచేత వాటి ప్రభావం నిల్.

ఆడవాని ముఖాన్ని చంద్రబింబంతో వర్ణిస్తారు గాని సూర్యునితో వర్ణించరెందుకు?

మరీ అలా మిటమిట్లాడి పోతూ వుండే సూర్యుడిలా ముఖంవేసుకుని ఏ ఆడదీ వుండదని కాబోలు!

జి వి ఆర్. రాజమండ్రి

ఏదైనా ఒక అలవాటు మార్చుకోవాలన్నా, మానుకోవాలన్నా సాధ్యమా?

సాధ్యమే — ముందే కాస్త జాగ్రత్తపడితే— ప్రతి అలవాటూ మొదట్లో చాలా తేలికగా—సాలెగూళ్లే. కాని రానురాను నాపరాళ్లయి కూర్చుంటాయి.

ఏ ఆర్ ఆర్. కలకత్తా

పిలవనిదే పుట్టింటికి వెళ్లకూడదట. ఎందుకని?

ఎందుకనేమిటండీ? పరువుగా వుండదు కనుక.

కె కె వి విజయవాడ

కలసిన ఆదర్శాల అనుబంధాలు — ఏ జన్మను విడిపోలేవులే — తనువులు వేరైనా దారులు వేరైనా ఆ బంధాలే నిలిచేనులే అన్నారు డా. సి. నారాయణరెడ్డి. మరి మీరు?

ముందు అక్షరాలూ, ఒత్తులూ నేర్చుకో చిట్టితల్లీ. మరీ బందాలు గట్రా బాగాలేదు. అది సిట్యుయేషన్ సాంగ్. ఏ హీరో నో, హీరోయినో — పైవారిని పెళ్ళాడేస్తే తనలోతను ఏ. ఎస్. పి. గొంతుకలోనో, సుశీల గొంతుకలోనో పాడుకున్న లైన్లు. ఇవి సినిమాల్లో విని ఆనందించాలి. నిజజీవితానికి అన్వయించుకుందుకు తాపత్రయపడకూడదు చిట్టితల్లీ — పగటికలల్లో పడకు.

ఏన్. వి. సికింద్రాబాదు

సహజంగానే మగవారిలో హుందాతనం వుంది. మీరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా యిది సత్యం.

ఉట్టి సత్యంకాదు నగ్నసత్యం. అనండి. ఏం పోయింది? సహజమైన హుందాతనం — రాజసం వుంటుంది.. ఎవరిలోనో తెలుసా? నైతికవిలువలు, నేర్పు ప్రాతిపదికలుగా పెట్టుకొన్నవాళ్లలో. ఇవి ప్రత్యేకం మగవారి సొత్తుకావు.




టి. ఏ ఆర్. ఎన్. గుడివాడ

నాస్తికులం అని చెప్పుకుంటూ శంకుస్థాపన మొదలైన కార్యక్రమాల్లో కొబ్బరికాయ కొట్టే వాళ్లని ఏమనుకోవాలి?

నాస్తికత్వం కూడా ఒకరకంగా ఫ్యాషన్ అయిపోయింది కదా. అందుచేత ఏ చెడు ముహూర్తంలోనో శంకుస్థాపన, ఏ దేవుడి తలో— మార్క్సిస్టు శిరస్సో పగలకొడుతున్నామనుకుంటూ కొబ్బరికాయలు కొడతారు కాబోలు. నాకంతగా తెలియదు. నేను శుద్ధ భక్తురాల్ని!

జె ఆర్. సాలూరు

శీలం చెడిన స్త్రీని కుక్కనాకిన కుండతో పోలుస్తారు. మగవాడు చెడితే?

కుండనాకిన కుక్క అనాలికదా! కాని అనరు. 'మగమహారాజండీ, ఆయనకేం?— ఒకత్తె కాదు, వందమందితో పోతాడు!' అని గర్వంగా చెప్పుకుంటారు. అదే చాలు యీ దపుర్భాగ్యపు సమాజంలో చెలామణి అవుతున్న ద్వంద్వ నైతిక ప్రమాణాలకి నిదర్శన.

జి. ఏ. ఆర్. ఖమ్మం

మీ కిష్టమైన సినీగీతం ఏమిటి?

ముందెప్పుడూ ప్రతిదానికీ తెలుగువీర లేవరా పాడుకునేదాన్ని. కాని మొన్న రిపబ్లిక్ డే నాడు టి.వి.లో క్రాంతిపురవీర అనే వో కన్నడ చిత్రం (చాలా పాతది) లోంచి క్రాంతివీర లేవరా అంటూ అత్యద్భుతమైన తెలుగువీర పాటలాంటిదే వినేశాను. అప్పటనుంచీ— ఇప్పుడిప్పుడే చదువుతున్నా తెరిచి జీవిత పుస్తకం అభినావ గేయంగా మార్చుకున్నాను.

ఏన్. జి కె. కాకినాడ

నాకు స్వార్థం అంటే అసహ్యం.

నాకూ అంతే. కాని స్వామీ, నిస్వార్థం కోడ్డు కూయనక్కరలేదు! మాట్లాడక, పూరుకుంటే చాలు.

పి. ఏ. వి. బి పామిడి

భర్తలు రాసిన రచనలను తమ పేరుతో పంపించి పేరు తెచ్చుకునే భార్యలను ఏమనాలి అక్కయ్యా?

సిగ్గులేనివాళ్లు! అంతేకాదు. భార్యల పేరుపెట్టి పంపే భర్తలు కూడా సిగ్గులేనివాళ్లే. అనాలి.

డి. జె. ఆర్. విశాఖపట్నం

సినారాఫీసు చిరునామా తెల్పండి?

శాస్త్రిభవన్, 35 హాడోస్‌రోడ్డు, మద్రాసు.6

ఏన్. వి ఆర్. విజయవాడ

సీతాలు కెందుకా సింగారం?

మురారిగారి నడగాలి— అలా ఎందుకు రాయించారో నాకెలాతెలుస్తుంది?!

ఎల్ జె. ఆర్. కలకత్తా

స్వార్థం ప్రతిఒక్కరికీ వుంటుంది అని నా నమ్మకం. కాని నిస్వార్థులు యీ సమాజంలో ఎవరైనా వుండరంటారా?

ఉంటారు. కాని వారు మేం నిస్వార్థపరులం అని చాటుకోరు.

పి. వి. ఎస్. ఆర్. హైదరాబాదు

ఎంతచేసినా, కనీసం గుర్తింపు లేనప్పుడు బాధ అనిపించడంలో తప్పా కె.రా గారూ.

తప్పుకాదు. కాని మనం చేయవలసిన పని చేస్తున్నప్పుడు దానికి పొగడ్తకోసం ఎదురుచూడ్డంలో అర్థం వుండదు రావుగారూ.

వెంకట్ ఉరవకొండ

అభ్యుదయవాదులు ఎవరు? విరోధకులు ఎవరు?

ముందుకు పోవడం ఆశించేవాళ్లు అభ్యుదయవాదులు. దానికి వ్యతిరేకులు అభ్యుదయ విరోధకులు అని నేను అనుకుంటున్నాను. మరింకేమైనా అర్థాలున్నాయేమో నాకు తెలియదు?





# నాకు 'తృప్తి' అని చక్కటి పేరుంది

కల్పవల్లి

రైలుకి సిగ్నలివ్వ లేదేమొ, చిన్నస్టేషనులో ఆగింది. తెల్లవారుతున్నది. అరవింద కదిలితే దుప్పటి సరిచేసేను. సునీల్ కూడా నిద్ర పోతున్నాడు. ఫస్ట్‌క్లాసు కూపేలోని నాలుగో బెర్త్ వైపు చూసాను. ప్రవీణ్ కోసం రిజర్వు చేయించినది. ఆఖరిక్షణంలో టిక్కెట్టు కేన్సిలు చెయ్యడం వలన ఖాళీగా ఉంది.

ఆ పేరిసులో మీటింగు యిప్పుడే ఉండాలా ? పేరిసు...అందమైన నగరం... కాని ప్రవీణ్‌కి పేరిస్సైనా, రోమైనా, హైదరాబాద్సైనా, ఢిల్లీ అయినా ఒక్కటే ... పని ... పని ... ఎప్పుడూ పని ... పన్నెండేళ్ళ ఒక్కటే మాట వింటున్నాను. అతను మరి ఎక్స్‌పోర్ట్స్ ఎండ్ ఇంపోర్ట్స్ కంపెనీకి యజమానంటే మాటలా ? నాన్నగారు పోవడంతో ఏకైక సంతానమైన నాకు సంక్రమించిన ఆస్తి వ్యవహారాలు చూడటంతో మరీ బిజీ అయిపోయాడు. మారు మూలున్న మౌంట్ అబూకి పని వెంట రాదనుకుంటే ముందే ...వింత వద్దనుకున్నా, బయలుదేరి, వేగం అందుకుంటున్న బండితో పోటీ పడతానంది మనస్సు.

నాన్నగారు పోయిన తరువాత యిల్లు కదలని నాకు ఈ ప్రయాణంతో ప్రాణం లేచి వచ్చింది. ఆర్టంటే స్పెషలు ఇంటరెస్టుండేది నాన్నగారికి. కళ మీదుండె ప్రత్యేకాభిమానమే ఆయన చేత ఏంటిక్స్, మినియేచర్సు వస్త్రాల ఎక్స్‌పోర్టు వ్యాపారం పెట్టించింది. నాకు ఆయన ఆస్తి పాస్తులతో పాటు ఆర్టిస్టిక్ టేస్టు కూడా వారసత్వంలో వచ్చింది. గొప్ప గొప్ప కళాకృతుల మోడల్స్‌ని సేకరించడానికి వెళ్ళినప్పుడు నన్ను తనతో తీసికెళ్ళే వారు.

ఇప్పుడు కూడా కళాకృతుల ఎగుమతి వ్యాపారం, విదేశాల నుండి తెప్పించడం వస్త్రాలు ప్రవీణ్ చేతుల మీదుగా జరుగుతున్నాది కాని అతను నాన్నగారిలాగ ప్రత్యేకాసక్తి చూపటంలేదు. అసలు ప్రవీణ్‌కి ఆర్టుకి చుక్కెదురు... లేకపోతే హనీమూన్ కెళ్ళినప్పుడు ప్రకృతి సంపద కాలవాలమైన కాశ్మీరు లోయలో హైదరాబాదు నుండి వచ్చే ట్రంకాల్ కోసం ఎదురు చూస్తాడా ? అక్కడికీ ముచ్చటపడి ఆతనితో రెండు

మూడు సారు వెళ్తే హోటలు రూము, ఒకటి రెండు సార్లే ప్రాప్తమైనాయి. అక్కడికి పట్టు విడవని విక్రమార్కుడిలాగ ఈ వేసవికాలం మౌంట్ ఆబూలో గడుపుమని బయలు దేరించేను. ఏ కళనున్నాడో 'సరే' అని తన క్లయింటు, స్నేహితుడైన మిస్టర్ షా ద్వారా అన్ని ఏర్పాటు చేయించాడు. కాని తీరా ప్రయాణం వేళకి అతన్ని పని భేతాళుడి లాగ పట్టుకొని వదలేదు. ఢిల్లీ నుంచి ప్రవీణ్ కూడా ప్లేన్ తీసికోవాలి కనుక హైదరాబాదు నుండి కలిసే వచ్చేము. మమ్మల్ని అహమ్మదాబాదు మెయిలు ఎక్కించి...

ఈ ఒక్కసారి ఆ మీటింగుని పోస్టుపోను చేసుకొంటే... 'ప్రవీణ్ ఎంటర్-ప్రైజర్స్' నా కోసం కొన్నాళ్ళు మరచిపోతే నష్టమేమిటి? నష్టమే మరి... దానికేగా ఫసె్టేడు... ఊరు కాని ఊరు వెళ్ళనంటే బలవంతాన పంపించేశా, పని తొందరగా పూర్తి చేసికొని అక్కడికే తిన్నగా వస్తానని. అతను వస్తాడని... హుం... నమ్మకమే... ఆ మిస్టర్ షా ఎలా నుంటాడో.. ఏ యిబ్బంది కలుగకుండా చూసి ఉండ వచ్చజెప్పాడు

* * *

ఆబూ రోడ్ స్టేషనుకి షా దంపతులు వచ్చారు. రైలు లేటవడంతో కొండమీదికి చేరి రెస్టు హవుసులో సామాను పెట్టించి వాళింటికి వెళ్ళేసరికి డిన్నరు వేళైంది. షా వాళ్ళది పాలరాతి వ్యాపారం, ఆబూ రోడ్‌లో 'మార్బుల్ ఫాక్టరీ' మౌంట్ ఆబూలో బొమ్మల దుకాణం. చుట్టుపక్కల ఊర్లలో షాపులు ఉన్నాయిట.

రాత్రి డైనింగ్ టేబిల్ దగ్గిర మేము కాక విజయ్‌కుమారని మరొక గెస్టున్నాడు. అతను ఢిల్లీలో ఆర్కియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియాలో పనిజేస్తున్నాడుట. పరిచయ వాక్యాలయాక మౌనంగా భోజనం చెయ్యసాగాడు. నేను ప్లేటులోవివి కెలుకుతూ మిస్టర్ షా చెప్తున్నవి వింటున్నాను.

"మీకిక్కడి ప్రదేశాలు చూపించడానికి నాకు వీలవుతుందో, లేదో... పని ఒత్తిడి కొంచెం ఎక్కువగా ఉంది. విజయ్, నువ్వు మిసెస్ ప్రవీణ్‌ని తీసికెళ్ళకూడదూ?"

"మీ అందరికీ కష్టమెందుకు? ప్రవీణ్ వచ్చాక..." ఆ మనిషి జవాబివ్వకుండా అన్నాను.

"మిస్టర్ ప్రవీణ్ మీకన్నీ చూపించి, ఎంటర్‌టెయిన్ చెయ్యవలసిన బాధ్యత నా కప్పజెప్పేడు. ఇంక విజయ్‌ని కష్టపెట్టడమెందు కంటారు? మీ కోసం అతను వేరే కష్టపడక్కరలేదు, తన పనిమీద అతనెలాగా వెళ్తాడు. అన్నట్టు చెప్పలేదు కదూ, విజయ్ 'జైన్ మందిర్స్' మీద రిసర్చి చేస్తున్నాడు."

"ఇట్ ఈజ్ ఎ ప్లెజర్ టు టేక్ యూ అరౌండ్, మిసెస్ ప్రవీణ్" ఆర్కియాలజిస్టు చాలా నెమ్మదిగా అన్నాడు.

"విజయ్ మీకు వివరంగా చక్కగా చూపిస్తాడు. అతనికిక్కడి ప్రతిరాయి, ప్రతి శిల్పం గురించి క్షుణ్ణంగా తెలుసును. పైగా అతనికి మీ భాష కూడా వచ్చును."

"మీరు తెలుగువారా?" ఆశ్చర్యంగా అడిగేను ఎదుటి వ్యక్తిని.

"కాదు. ఆంధ్రప్రదేశ్‌లో ఉండటం వలన..."

"ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడున్నారు? ఇంత స్వచ్ఛమైన తెలుగు మాట్లాడుతున్నారంటే చాల రోజులే ఉండి వుంటారు."

"విశాఖపట్నంలో స్కూలు ఫైనలు వరకు చదువుకొన్నాను." నా ప్రశ్నకి జవాబు తప్ప ఒక్క మాట కూడా ఎక్కువ చెప్పలేదు.

"మీరు మాకు అర్థం కాకుండా మాట్లాడుకుంటుంటే..."

"ఐ యామ్ సారీ," అతను మిస్టర్ షా మాటలని మధ్యలోనే అందుకున్నాడు.

"ఇంత దూరంలో తెలుగు మాట్లాడే వారు కలియగానే...," నేను సంజాయిషీ యిస్తున్నట్టన్నాను.

"రాజస్థాన్‌లో తెలుగు మాట్లాడే వారే కాదు. ఏ భాషంటే ఆ భాష మాట్లాడే వారు కలుస్తారు. ఇక్కడ వాళ్ళ దేశంలో..." అంటూ మార్వాడీ, గుజరాతీ బిజినెస్ వాళ్ళ గురించి తరువాత విజయ్ గురించి చెప్పేడు.

తాత ముత్తాతల కాలం నుండి వాళ్ళది బట్టల వ్యాపారం. స్వంత ఊరైన జయపూరులో పెద్దకొడుకుని పెట్టి, అతని తండ్రి విశాఖపట్నంలోని దుకాణాన్ని తను చూసేవాడు. తండ్రి పోయిన తరువాత ఇతని వంతు కొచ్చిన ఆ షాపు అమ్మేసి, తల్లి, అన్నయ్య ఆ డబ్బుతో వ్యాపారం పెట్టమని ఎంత చెప్పినా వినకుండా చదువులో పడ్డాడు. 'జైన్ మందిర్స్' స్టడీ స్వంత యింటరెస్టుతో చేస్తున్నాడు కాబట్టి డిపార్టుమెంటు వాళ్ళ సదుపాయలెక్కువ వాడుకోడు. అతని బస కేర్పాటు కూడా మేమున్న రెస్టుహవుసులోనే మిస్టర్ షా చేయించేడు. వాళ్ళిద్దరూ జయపూరు కాలేజిలో కలిసి చదువుకున్నారుట.

* * *

రెస్టుహవుస్, బాల్కనీలో నిలబడితే ఎదురుగా 'నక్కీలేక్' మూడు కొండలు



కనిపిస్తాయి. దూరంగా కొండమీదున్న పెద్ద రాయిని 'టాడ్ రాక్' అంటారు. అరావళి పర్వతాలలో యింత రమ్యమైన ప్రదేశం ఉండదని చూసి దీనికి ప్రాముఖ్యత నిచ్చిందిన టాడ్ అన్న ఇంగ్లీష్ హిస్టోరియన్ని తలచుకొంటూ లేక దగ్గరున్న పార్కులో కొత్తేదో జనాన్ని చూస్తున్నాను. పిల్లలు హార్స్ రైడింగ్ చేస్తోరు ఉత్సాహంతో చిన్న చిన్న పనులు చేసుకుంటూ పొట్ట పోషించుకుంటున్న రాము వాళ్ళని రోజు తీసికెళ్ళాడు.

ప్రవీణ్ వచ్చుంటే... అందరి లాగ ... హుం... ప్రవీణ్ ... పదిహేను రోజులకి నిన్నొక 'టెలిగ్రాం' ఉత్తరం వచ్చింది. పేరిస్ నుండి యింకెక్కడికో వెళ్ళవలసి వచ్చిందని, పదిరోజుల దాక రానని, మరోసారి క్షమించు. క్షమించాలట మరోసారి... ఇది ఎన్నోసారో...

అసలే మనసు బాగులేకపోతే పొద్దున్నే షా వాళ్ళింటి నుండి కబురు, 'డ్రైవరు సెలవు పెట్టేడట, రోజంతా వాళ్ళింట్లో గడపవలసింది.' నాకు వెళ్ళాలని లేదు. కాని తప్పదు. మొదటి రోజు తరువాత మళ్ళీ వాళ్ళింటికి వెళ్ళలేదు. రోజు డ్రైవరుతో కారు పంపిస్తున్నారు కారు లేకపోయినంత మాత్రాన టైము గడవక పోతుందా? షాపింగ్ చెయొచ్చును, పిక్నిక్ చుట్టూ తిరగొచ్చును, బోటింగ్ చెయ్యొచ్చును, వచ్చేపోయే జనాన్ని చూస్తూ కబుర్లాడుకో వచ్చును... కాని ఎవరితో?

నా కెవరు కంపెనీ యిస్తారు? మిస్టర్ విజయకుమార్... అప్రయత్నంగా మనస్సుకి తట్టిన పేరుతో పాటు అతని గంభీర రూపం కళ్ళముందు కొచ్చింది. పదిహేను రోజులైతే కలిసి తిరుగుతున్న మొదటి రోజు లాగే చూసి చూడ నట్టున్నాడుతడు. 'వైట్ సిల్లింగ్' చేస్తున్నాను కష్టమున్న ట్లనిపించదు- ఇంక దొరికే నాతో కబుర్లాడటానికొస్తాడా? ఇప్పటికే టైము వేస్టవుతున్నదని బాధ పడుతున్నాడేమో... ఎందుకో అంతటి మనిషి అనిపించదు. లేకపోతే ఒకటి రెండు రోజుల్లో మాకన్నీ చూపించి తన పని చూసుకొందును... ఆ మందిరాలు ఎంత చక్కగా వివరిస్తాడు...నే నడిగే ప్రశ్నలకి ఎంత ఆసక్తిగా జవాబులు చెప్తాడు... ఆ గొంతుకలోని ప్రత్యేకత

**నాకు 'తృప్తి' అని చక్కటి పేరుంది**

చింత నన్నొకట్టుకొని... రెస్ట్ హౌస్ వెనకున్న రఘునాథ్ టెంపుల్ గంటలు వినిపించేసరికి ఆలోచనల నుండి తేరుకొని లోపలికెళ్ళేను.

సాయంత్రం టీ తాగుతూ మిస్టర్ షా అడిగేడు. "ఇక్కడివన్నీ విజయ్ చూపించేడా, మిసెస్ ప్రవీణ్?"

"రెండు మూడు రోజులైతే మబ్బుగా ఉండటంతో 'సన్ సెట్ పాయింట్'కి వెళ్ళడమవలేదు తక్కిన చోట్లన్నీ చూడటమైంది. ఇవాళ వెదర్ బాగుంది, కాని ."

---

## ఎడారి

విజృంభిస్తున్న అగ్ని కత్తెరలు
వేసేసిన తలుపులూ తెరలూ
మిట్ట మధ్యాహ్నం
చెట్టులేనా కనపడదు చుట్టు పక్కల -
పారుతున్న లావాలా
పరుచుకు పోయిన తారురోడ్డు
మెరుగుతున్నాది తళ తళలాడుతూ
చెరుగుతున్నాది చండ్రనిప్పులు !
నాలిక వెళ్ళబెట్టుకొని గోడవారనుంచి
నావేపే చూస్తున్న నల్లకుక్క
చెవులు రిక్కించి పరిగెత్తి అందుకుంది
ఎవరో విసిరేసిన ఎంగిలాకు ముక్క !
ఆవిరులు కక్కుతూ ఆవలిస్తూంది నగరం
అంతా శూన్యం - ఎడారిలాగే ఉంది!

— వజ్ఝల కాళిదాసు.

---

"కారు ఫ్రీగానే ఉంది, కాని నాకు తీసికెళ్ళడానికి వీలవదు." మిస్టర్ షా ఫైలో చూస్తూ తిరిగి అన్నాడు, "విజయ్, పోనీ నువ్వు కారు డ్రైవ్ చెయ్యకూడదూ? మీరు 'భాభీ'ని కూడా..."

"నాకేం అభ్యంతరం లేదు. భాభీ త్వరగా తయారవుతే..."

"విజయ్, నాకు చాలా పనుంది. ప్లీజ్ ఎక్స్క్యూజ్ మి, మిసెస్ ప్రవీణ్," మిసెస్ షా రానన్నగానే వెళ్ళాలనిపించలేదు కాని అతను నొచ్చుకుంటాడేమోనని బయలు దేరేను.

కారుని కొండలకి లోయలకి మధ్య జాగ్రత్తగా నడిపిస్తున్నాడు. అతని పక్కన కూర్చున్న నేను ప్రకృతి సౌందర్యాన్ని తనివి తీరా ఆస్వాదిస్తున్నాను. సునీల్, అరవింద షా వాళ్ళింట్లో ఉండిపోయారు, వాళ్ళ పిల్లలతో ఆడుకుంటామని

"అరె, అరె ఎంత బాగున్నాయో" స్వగతం కొంచెం గట్టిగా వచ్చింది.

"ఏమిటి?" అన్నాడు కారు స్లో చేస్తూ.

అతని దృష్టిని మళ్ళించినందుకు నొచ్చుకుంటూ గుత్తులు, గుత్తులుగా పూసిన తెల్లటి పువ్వుల్ని చూపించాను

"ఆహా, అడవి జాజులు, మిసెస్ ప్రవీణ్ చూస్తారా?" అంటూ కారు పార్కు చేసి తనలో తనేదో అనుకొంటూ దిగేడు.

"ఏమిటంటున్నారు?" అన్నాను నేను కూడా దిగుతూ.

"ఒక గొప్ప 'షాయర్' అన్నాడు. 'హజారోం సాల్ నర్గిస్ అపనీ బేనూరీ పర్ రోతీ హై, తొ బడీ ముష్కిల్ సె హోతా హై చమన్ మె దీదావర్ పైదా' అంటే నర్గిస్ పువ్వు ఏళ్ళ కొద్దీ తన అందం చూసేవాడు లేడని బాధపడితే దానిని మెచ్చుకొనేవాడు పుడతాడట. ఆ కవి మాటలను మిసెస్ ప్రవీణ్ మీరు అక్షరాలా..." అంటూ అందిన పూల గుత్తులు కోసి తెచ్చాడు.

"కాలు కింద పెట్టక్కరలేని యింట్లో పుట్టి, ఏ పువ్వు కావలిస్తే అది ప్రపంచంలో ఎక్కడి నుండైనా కోరిన వెంటనే తెప్పించ గల మిస్టర్ ప్రవీణ్ కి భార్యయైన మీరు... వైల్డ్ ఫ్లవర్స్ తో ప్రేమ ..ఎక్కడా పొత్తు కుదరటంలేదు, మిసెస్ ప్రవీణ్" అన్నాడు పువ్వుల్ని నాకిస్తూ.

అతని కమెంటుకి ఆశ్చర్యపోయి చూసాను. ఇన్ని మాటలెప్పుడూ అతను శిల్పసౌందర్యాన్ని వర్ణించి చెప్పడం తప్పితే నాతో మాట్లాడలేదు. నేను జవాబివ్వకుండా పువ్వుల్ని చూస్తుంటే సిగరెట్ వెలిగించి తిరిగి అన్నాడు.

"కాటేజి ఎంపోరియమ్స్" 'ఏంటిక్ కార్నర్'లలో కొన్న వస్తువులు డ్రాయింగ్ రూములో పెట్టి సంతోషించే ఈ రోజుల్లో, ఈ మారుమూల శిథిలాల్లో అందాలు వెతుక్కుంటూ వచ్చిన మిమ్మల్ని చూస్తే ఆశ్చర్యమేస్తున్నది, మిసెస్ ప్రవీణ్."

"శిథిలాల్లో అందాలని మీరు గుర్తు

కొన్నారా మిస్టర్ కుమార్? నా రాక వలన మీకేమైనా నష్టమొచ్చిందా?" నా మాటలు కోపంగా వచ్చాయేమో అతను చిరుకోపాన తలెత్తాడు.

"అయామ్ సారీ మిసెస్ ప్రవీణ్, నేనా ఉద్దేశంతో అనలేదు" అంటూ కారు తలుపు తీసాడు. నేను కూర్చున్నాక, స్టీరింగ్ దగ్గర కూర్చుంటూ మెల్లిగా అన్నాడు, "మీరు రావడం నా అదృష్టమని భావిస్తున్నాను, మిసెస్ ప్రవీణ్"

"మిసెస్ ప్రవీణ్, మిసెస్ ప్రవీణ్, నాకు 'తృప్తి' అని చక్కటి పేరుంది" అనుకోకుండా నా నోటంట వచ్చింది. కారు స్టార్టు చేస్తున్న అతనొక్కసారి నన్ను చూసాడు

"జీవితంలో ఏ విజయం పొందక పోయినా 'విజయ్' అనబడే ఈ మనిషిని మీరు 'విజయ్' అని పిలిచినప్పుడు." అంటూ కారు నడిపించేడు.

మిగిలిన దారంతా మా మధ్య మాటలు ఎక్కువ జరుగలేదు. అతని జీవితం సుఖమయం కాదని నేను చూచాయగా గ్రహించినా అతనెప్పుడూ జీవితంలో ఓడిపోయానని యింత స్పష్టమైన మాటల్లో అనలేదు. అసలతను తన నిజ జీవితం గురించి చాల తక్కువ చెప్పేడు. అతని భార్యకి పుట్టింటి అత్తింటి తరపు వాళ్ళందరి కన్నా తక్కువ ఆదాయాన్నిచ్చే అతని ఉద్యోగమంటే విరక్తి. బంధువులతో సమానంగా స్టేటస్ మెయిన్‌టెయిన్ చెయ్యడానికి జీతంరాళ్ళు సరిపోక, అతని వాటా ఆస్తి తిరిగి పోతున్నదని సాధిస్తుందని, అతని పిల్లలకి కూడా అతని ప్రియాతి ప్రియమైన శిల్పాన్వేషణంటే నిరసనని వచ్చిన కొత్తల్లో అనాలోచితంగా నేనడిగిన ప్రశ్నకి చెప్పేడు. ఆ రోజు...

దిల్వాడా టెంపుల్ శిల్పకళ మీద తన అభిప్రాయాలు ఉత్సాహంగా చెప్తున్నాడు, "ఈ మారుమూల కొండమీద యింత చక్కగా పాలరాతిని మలచిన చిత్రకారులు.. ఈ స్తంభంమీద లత, పువ్వులు... దీనిని శిల్పకళనే కన్న సమకాలీన..."

నా దృష్టి పాలరాతి శిల్పాల నుండి అతని మీదకి మళ్ళింది. పొడుగ్గా, పొడుగ్గా మంచి రంగు, ప్రవీణ్ వయస్సే ఉంటుంది. ఆ కళ్ళజోడు, మీసం కట్టు, కొద్దిగా నెరసిన జుట్టు– అతని స్కాలర్ ప్రతిబింబిస్తున్నాయా లేక సినిమాల్లో హీరోని నడివయస్కుడిగా చెయ్యడానికి పెట్టినట్టు ఆర్టిఫిషియల్‌గా ఉన్నాయా? ఏదేమైనా ఆకర్షణీయంగా, హుందాగా ఉన్నాడు, ప్రవీణ్‌లాగే. ప్రవీణ్ వస్తుంటే... ఇదే ప్రవీణైతే.. అతను చెప్తూ నేను వింటూ...

"ఏమిటలా చూస్తున్నారు?" అతని ప్రశ్నకి తృళ్ళి పడ్డాను.

"జీవంలేని శిల్పాలకి మాటలతో ప్రాణం పోస్తుంటే ... అవునట్టు మీ భార్యెందుకు రాలేదు?" తత్తరపాటుని సర్దుకుంటూ అన్నాను.

అతని ఉత్సాహమంతా ఒక్కసారి చప్పబడి పోయింది. మొహంమీద విచారరేఖ తళుక్కుమని మాయమైనా నా కంట బడింది.

"మా ఆవిడా? శిల్పాల మధ్య నేను

# నాకు 'తృప్తి' అని చక్కటి పేరుంది

కూడా రాయిన్నైపోయాగావని, పిల్లలకి కూడా ఈ జబ్బు పట్టుకుంటే..."

"పిల్లలా?" అతని పిల్లలున్నారనీ నాకు తెలియదు.

"పిల్లలే...నాకు ముగ్గురు పిల్లలున్నారని చెప్పలేదు కదూ మీ వాడంత అమ్మాయి, యిద్దరబ్బాయిలు," అంటూ తన ఫేమిలీ గురించి క్లుప్తంగా చెప్పేడు.

అవేళ నేను పెద్ద పట్టించుకోలేదు గాని యిప్పుడు తలచుకుంటే ... అతని గంభీర ముద్ర వెనక తళుక్కుమన్న విచార రేఖ ... అతని జవాబు లోని నిర్లిప్తత ... తరువాత మెకానికల్‌గా వచ్చిన వర్ణన...సిగిరెట్టు మీద సిగిరెట్టు, అప్రయత్నంగా అతన్ని చూశాను. సిగిరెట్టు యిప్పుడూ అతని పెదవుల మధ్య ఉంది. 'జీవితంలో ఏ విజయం పొందక పోయినా' తన బాధని పొగగా గాలిలో కొదలడానికా ఆ అఖండగ్ని ?

అతను నన్ను గురించి ఏమనుకుంటు న్నాడు ? కారు స్టార్టు చేసే ముందు ఆ చూపు... 'మొదటి పేరుతో పిలచ కొనేటంత సన్నిహితాలమా ?' అని ఆశ్చర్య పడ్డాడా? నేనేమి అనకుండా ఉండవలసింది. కాని మిసెస్ ప్రవీణ్ అని మాటి మాటి కంటూంటే ప్రవీణ్ రాని లోటుని ఎత్తి చూపినట్టయి ఉక్రోషం వచ్చింది.

తిరుగు ప్రయాణంలో ఊరి దరిదాపుల కొచ్చేక కారుని స్లో చేసి, అయిపోయిన సిగిరెట్టు ముక్కతో కొత్త దాన్ని వెలిగించి అన్నాడు, "నేను రావక్ పూరు పైన మంది రాల స్టడీ చెయ్యాలని కొన్నాను కుంటు న్నాను. మీకు రావాలనుంటే కారిమ్మని మిస్టర్ షా నడగొచ్చును. ఉదయపూర్, చిత్తోడ్‌గడ్, జయపూర్ వగైరా చూడాలనుంటే..."

"ఐ ఉడ్ లవ్ టు అకొంపనీ యూ" నా వింధ్యా జియాజవ్ అణచినా అణగలేదు.

* * *

బాల్కనీలో నిలబడి దూది పింజెల్లాంటి మేఘాలతో ఆడుకుంటున్న పున్నమి చంద్రుడిని చూస్తున్నాను. పిల్లలప్పుడే నిద్రపోయారు. రేపు ప్రయాణం ... ప్రవీణ్ రానేలేదు. యూరప్ నుండి వస్తూ ఫోను చేసాడు, 'నాకు రావడాని కవదు. బోంబే వస్తే కలిసి వెళ్ళిపోదాము' అతను రాలేదన్న కోపం రాను రాను తగ్గిపోయింది ఇక్కడ రోజులు ఆనందంగానే గడిచాయి, విజయ్ కంపెనీలో. అతని కెలాగుందో? ఫినరిష్‌గా ఉందని షా వాళ్ళింటి డిన్నరుకి రాలేదు. ఒకసారి వెళ్తే ... పైజామా కుర్తాలో పచార్లు చేస్తూ లాన్‌లోనే కనిపించాడు.

"ఫీవరిష్‌గ ఉందని గాలిలో తిరుగుతున్నారేమిటి?"

"నాకేమి లేద, వాళ్ళింటి కెళ్ళా లని పించక..." అంటూ నావి చూసి తిరిగి అన్నాడు, "అలాగ తిరిగొద్దాము, వస్తావా, తృప్తీ ?"

లేక్ ఒడ్డుగా నడుస్తుంటే ఉన్నట్టుండి అన్నాడు, "నీ చీర చాలా బాగుంది" ఈ మధ్య మా యిద్దరి మధ్య దూరం తగ్గింది. నేనింకా అతనిలాగ ఏకవచన ప్రయోగం చెయ్యకపోయినా అతని వ్యక్తిగత ప్రశంసలి నందుకోవడం అలవరచు కున్నాను

"నా చీర బాగుందా లేక మీరు సెలక్టు చేసిన శాలువ బాగుందని ఇండైరెక్టుగా చెప్తున్నారా?" ఏదో ఒకటనాలని అన్నాను.

"నిజం చెప్పాలంటే చీరకి, శాలువకి ఆశ్రయ మిచ్చిన మనిషెక్కువ అందంగా ఉన్నారు."

అతని పొగడ్తకి నా ప్రమేయం లేకుండానే గుండె దడ, రక్త ప్రవాహం తీవ్రమై చెవులు వేడెక్కాయి ఎంత వయసొచ్చినా సిగ్గు పడటం ఆడవాళ్ళకి నేర్ప కుండా నచ్చే విద్య తరెల్లి, అతను నన్నే చూస్తున్నాడని కళ్ళు దించుకుంటే చీర కనబడింది. అందమైన చీరే పోయినసారి పుట్టిన రోజుకి కట్టుకున్నాను ఆవేళ తొందరగా వస్తానన్న ప్రవీణ్ రోజులాగే ఆలస్యంగా వచ్చి, భోజనంచేసి పడుకుందుకి తయారవుతూంటే, ఉండబట్టలేకన్నాను. "ఈ చీర ఎలాగుందండీ?" నన్ను, నా చీరని మార్చి మార్చి చూసి, "నీ పుట్టిన రోజు సెలబ్రేట్ చెయ్యడానికి తొందరగా వస్తానన్నాను కదూ, మరిచే పోయాను. ప్లీజ్, నన్ను క్షమించవూ... బెటర్ లేట్ దేన్ నెవరన్నారు... పోనీ యిప్పుడే..." అంటూ లైటార్పి చేతులు చాచాడు.

(36 వ పేజీ చూడండి)

( గత సంచిక తరువాయి )

























[ఇంకా వుంది]

# సినిమా విశేషాలు -జి. వి. జి.

## బాహ్య ప్రదేశాలలో చిత్రీకరణలు

ఎన్ టి ఆర్ హీరోగా కె రాఘవేంద్రరావు దర్శకత్వంలో ఎం అర్జునరాజు, కె శివరామరాజు నిర్మించే రోజా మూవీస్ "వేటగాడు" వర్ణ చిత్రం ఏప్రిల్ 1 నుంచి 25 వరకు ఊటీలో ఒకే షెడ్యూల్‌లో పూర్తయింది పతాక సన్నివేశాలను పార్సన్ లోయలో 30 అడుగుల అమ్మవారి విగ్రహం ముందు 60 మంది డాన్సర్లు, దాదాపు 200 మంది జూనియర్ ఆర్టిస్టులతో చిత్రీకరించారు శ్రీదేవి నాయిక సత్యనారాయణ, జగ్గయ్య, రావు గోపాలరావు, కాంతారావు, అల్లు రామలింగయ్య, నాగేష్, మమత, పండరీబాయి ఇతర పాత్రధారులు తెర వెనుక జంధ్యాల, వేటూరి, చక్రవర్తి, కె ఎస్ ప్రకాష్, భాస్కరరాజు, కోటగిరి గోపాలరావు, విశ్వనాధరెడ్డి నిర్వహణ కుమార్జీ

శోభన్‌బాబు, జయసుధ జంటగా నటించే మమతా మూవీస్ "జూదగాడు" వర్ణ చిత్రానికి ఇటీవల హొగెనకల్‌లో కొన్ని కీలక సన్నివేశాలు చిత్రీకరింపబడ్డాయి శ్రీధర్, జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, గోపీనాథ్, అంజలీదేవి, సుమలత, జయమాలిని, మాస్టర్ క్రాంతినాథ్ ఇతర నటవర్గం తెర వెనుక ముళ్ళపూడి వెంకటరమణ, చక్రవర్తి, విలియమ్స్, ఎస్ కృష్ణారావు, లంకిరెడ్డి నిర్మాత కె ఛటర్జీ దర్శకత్వం వి మధుసూదనరావు

శోభన్‌బాబు—జయసుధపై రెండు పాటలు, కృష్ణ జయప్రదపై రెండు పాటలు, చంద్రమోహన్—మాధవిపై ఒక పాట, మరికొన్ని ప్రధాన సన్నివేశాలను డైరెక్టర్ కె బాపయ్య చిత్రీకరించడంతో డి రామానాయుడు నిర్మించే సురేష్ మూవీస్ "మండే గుండెలు" వర్ణచిత్రం మూడవ షెడ్యూల్ పూర్తయింది జూన్‌లో మరో రెండు షెడ్యూల్స్ అనంతరం చిత్రం విడుదలకు సిద్ధమవుతుంది సత్యనారాయణ, గుమ్మడి, అల్లు రామలింగయ్య, నూతన్ ప్రసాద్, కాంతారావు, రావి కొండలరావు, కె వి చలం, సారథి, పి ఎల్ నారాయణ, పి జె శర్మ, భీమరాజు, అంజలీదేవి, సూర్యకాంతం, మోహిని, లక్ష్మీచిత్ర ఇతర తారాగణం తెర వెనుక జంధ్యాల, ఆత్రేయ, మహదేవన్, వెంకట్, జి వి సుబ్బారావు, రవి, కె మురళీమోహనరావు

పి చంద్రశేఖరరెడ్డి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి బలరామరెడ్డి, జి రెడ్డి శేఖర్ నిర్మించే "కాళరాత్రి" (తమిళంలో — ఒరు ఇరవు ఒరు పరవై) వర్ణ చిత్రం చాలా వరకు హార్స్లీ హిల్స్‌లో చిత్రీకరింపబడింది రంగనాథ్, శరత్ బాబు, నరసింహరాజు, ఈశ్వరరావు, త్యాగరాజు, రాజేన్‌బాబు, లత, కవిత, రమాప్రభ, ప్రవీణ, పండరీబాయి, అంజలినాయుడు, నవ నటులు రవీంద్రన్, రవిరాజ్ పాత్రధారులు తెర వెనుక భీశెట్టి, ఇళయరాజా, కె సి శేఖర్

## "కొత్త అల్లుడు"లో కుంభకోణం

షాపు ముందున్న బీరువాకు ఆనుకుని హరి, 'శ్రీపతి కార్పరేషన్' మీద పోలీసులకు ఫిర్యాదు రాసి, "నాన్నగారూ! సంతకాలు చేయండి," అన్నాడు

"ఏమిటి, హరీ?" అన్నాడు స్వామి (కాంతారావు)

"అదే — నిన్ను పట్టుకున్న దొంగ మందుల గురించి పోలీసులకూ, ఆరోగ్య మంత్రికీ కంప్లెయింట్లు"

"వద్దు బాబూ! అది చాలా పెద్ద సంస్థ"

"పెద్దసంస్థ కాబట్టే పెద్దదెబ్బ కొట్టాలి మందు సీసాకన్నా మనిషి ప్రాణాలు చవకైపోయాయి వీళ్ళకు"

"నీ ఫిర్యాదు కంపెనీ యజమానికి, ఆ పెద్దాయనకి రాయి ఆయనకు తెలీకుండా మధ్య వాళ్ళు చేసుంటారీ పని"

"మధ్య వాళ్ళనీ, చివరివాళ్ళనీ కంట్రోల్ చెయ్యడం కూడా ఓ పనే కదా?" అని హరి (కృష్ణ) అనేసరికి, మందులు అమ్ముతూన్న కుంభకోణం (రాజ్‌బాబు) నిచ్చెన మీద నుంచే "ఈ దేహంలో మధ్యనుండే కడుపుకొచ్చినా, అడుగునుండే కాలికొచ్చినా — మందు పైనుంచే నోట్లోంచి పోస్తాం కదా?" అన్నాడు

స్వామి గుండె బాదుకుని, "అమ్మ నీ దుంపతెగ — కుంభకోణం! పరగడుపున ఎంత పెద్ద కొటేషను పడేశావురా!" అనుకున్నాడు తనలో తాను

పర్వతనేని సాంబశివరావు దర్శకత్వంలో తయారైన "కొత్త అల్లుడు" వర్ణ చిత్రంలో జయప్రద నాయిక



'వేటగాడు'లో శ్రీదేవి, ఎన్ టి రామారావు



'కొత్త అల్లుడు'లో కృష్ణ, చిరంజీవి



## "ప్రియబాంధవి"లో పెళ్ళి తాంబూలాలప్పుడే టెలిగ్రామ్

"ఏమిటి, పట్టాభిరామయ్యగారూ! శుభ ముహూర్తం వచ్చేసింది తాంబూలాలు మార్చుకోండి," అన్నాడు పురోహితుడు (మాదుకూరి సత్యం)

పట్టాభిరామయ్య (కాంతారావు) లేచేసరికి "బావగారూ! ఒకసారిలా వస్తారా?" అంటూ బావ (వల్లం నరసింహారావు) దగ్గరికి పిలిచి, 'మీరూ మరోలా అనుకోక పోతే, ఈ వివాహం అన్నీ విచారించే చేస్తున్నారా? ఏం లేదు. తెలిసీ చెప్పకపోవడం తప్పు. రేపు మళ్ళీ మీరే అడుగుతారు ఎందుకు చెప్పలేదని. ఈ అమ్మాయికి పెళ్ళయిందో లేదో నాకు తెలియదుగాని, ఒక పిల్ల మాత్రం ఉంది, బావా! ఇది నిజం!" అన్నాడు

వేణు (రంగనాథ్) చకితుడై, "చూసిందే నిజమని ఎందుకనుకోవాలండీ? మనిషిని పోలిన మనుషులు ఉండొచ్చుగా? ఇప్పుడు మీరు చెప్పేది అబద్ధమే అయితే మాత్రం – ఒక ఆడదాని జీవితం నరకమౌతుంది. మరచి పోకండి," అన్నాడు.

ఇంతలో పోస్ట్‌మన్ "సార్! టెలిగ్రామ్!" అంటూ ఇచ్చి వెళ్ళాడు.

నందివర్ధనం (నాగేష్) కవర్ చింపుతూ, "పెళ్ళే కాలేదు. అప్పుడే గ్రీటింగ్సా! హు టెలిగ్రామ్ అంటే చాలు – మంచైనా, చెడైనా మనుషులు ఇలాగే బిగుసుకు పోతారు," అంటూ కాగితం మడత విప్పి, "యువర్ డాటర్ సీరియస్లీ ఇంజర్డ్ .. స్టార్ట్ ఇమ్మీడియట్లీ ... టు–రాధ" అని చదివాక "అమ్మా, రాధా! నీ కూతురు చాలా సీరియస్‌గా ఉందట. వెంటనే బయలుదేరమ్మా," అన్నాడు.

రాధ (శారద) నిశ్చేష్టురాలై పోయింది

పురోహితుడికి ఇదేమీ అర్థంకాలేదు "వాళ్ళే ఊరుకోండి ఆ పిల్లకి ఇంకా పెళ్ళే కాలేదు అప్పుడే బిడ్డ తల్లిని చేసేశారు ఇదెక్కడ వేళాకోళమండి?"

"వేళాకోళంకాదు, నిజం" అంటూ పట్టాభిరామయ్య దిగ్గున లేచి, భార్యతో "శాంతా బయలుదేరు," అన్నాడు అతని చేతులు పట్టుకొని రామనాథం (ధూళిపాళ) "బావగారూ! నా మాట వినండి," అన్నాడు "నాకంతా తెలుసు ఒక బిడ్డ తల్లిని నా కోడలుగా చేసుకోలేను. అది మా సాంప్రదాయం కాదు," అంటూ పట్టాభిరామయ్య, భార్యతో విసురుగా వెళ్లిపోయాడు

"ఈ పాడు టెలిగ్రామ్ కూడా ఇప్పుడే రావాలా?" అని రామనాథం నెత్తి బాదుకుంటూంటే, "రాధా! నీ కూతురు చాలా సీరియస్ అట వెంటనే బయలుదేరమ్మా," అన్నాడు నందివర్ధనం

రాధ దిక్కుతోచక శూన్యంలోకి చూస్తూండి పోయింది

బి. వెంకటేశ్వరరావు నిర్వహణలో శ్రీపతిరావు నిర్మించే శ్రీపతి ఫిలిమ్స్ "ప్రియబాంధవి" రంగుల చిత్రానికి దారా దర్శకుడు.



'రంగూన్ రౌడీ'లో ఒక దృశ్యం

## 'ఛాయ''లో ప్రసాద్‌కు చెంపకాయ ప్రసాదం

కాలేజ్ నుంచి ఇంటికి వెళ్తున్న ఛాయను స్కూటర్‌మీద అనుసరించిన ప్రసాద్ సడన్‌బ్రేక్ వేసి, ''హల్లో శకుంతలగారూ! ఐ యామ్ సారీ. తెలుగు మాస్టారు శకుంతలోపాఖ్యానంతో బుర్ర నింపేశారేమో – ఆ పేరు వచ్చేసింది మీరు ఆ రోజు పార్టీ ఇచ్చినందుకు చాలా థాంక్సండి,'' అన్నాడు

''నో మెన్షన్,'' అంది ఛాయ ముభావంగా

''అన్నట్లు ఈ సంగతి తెలుసా మీకు? నా స్కూటర్ వెనక సీటు మీద ఎవర్నీ కూచోనివ్వను ఎందుకో తెలుసాండీ? ఆ సీటుమీద కాబోయే నా స్వీట్ హార్ట్ కూర్చోవాలని నా ఉద్దేశ్యం''

''అలాగా?''

''మీరు కూర్చుంటానంటే నాకు అభ్యంతరం లేదు''

ఛాయ ఏం మాట్లాడకుండా వెళ్లిపోసాగింది

''ఛాయగారూ! మిమ్మల్నేనండీ''

ఇంక సమాధానం చెప్పక తప్పదనిపించింది ఛాయకు ''చూడండి, మిస్టర్ ప్రసాద్! మీ ఉద్దేశ్యం అర్థం చేసుకోనంత వెర్రిదాన్నేం కాను అయినా, నేను మీలాగా సరదాకు కాలేజ్‌కి రావడంలేదు ఈ చదువుమీద నా భవిష్యత్తు ఆధారపడి ఉంది కనుక, కాలేజ్‌కి వస్తున్నాను అంతేగాని, డబ్బుగలవాళ్ళ స్కూటర్ల వెనకా, కార్లలోనూ తిరగాలనే కాంక్షలేదు సరేనా?''

''మీరింత కుండ బద్దలు కొట్టినట్లు చెప్తే, నేనూ కుండ బద్దలు కొట్టేస్తాను చెప్పండి – పగలగొట్టనా? నాటకం వేశారు రవి పిలిస్తే పార్టీకి వచ్చారు మీకు ఏ ఆశలూ లేకుండానే ఈ పనులన్నీ చేశారా?''

''నాటకం వేసింది కాలేజీ గౌరవం కోసం పార్టీకి వచ్చింది సంస్కారవంతులు పిలిచారని''

''అయితే, సంస్కారంలేని మనిషిగా అడుగుతున్నా నేను 'స్వీట్ డ్రీమ్' అనే నాటకం వేస్తున్నా అందులో మనిద్దరమే పాత్రధారులం. ఒథెల్లో నాటకంలో బెడ్ ఛేంబర్‌లాగే ఇందులోనూ ఒక బెడ్‌రూమ్ సీన్ జస్ట్ ఫర్ ఒన్ నైట్!''

అంతే... ప్రసాద్ చెంప ఛెళ్ళుమంది కళ్ళు బైర్లుకమ్మి తేరుకునే లోగా ఛాయ అక్కడలేదు

శివాజి (ప్రసాద్), రూప (ఛాయ) తోపాటు నూతన్‌ప్రసాద్, సత్యేంద్రకుమార్, పి ఎల్ నారాయణ, మంజుభార్గవి, శైలజ, రాజేంద్రప్రసాద్ పాల్గొన్న వెంకటకృష్ణా ఫిలిమ్స్ ''ఛాయ'' చిత్రాన్ని హనుమాన్‌ప్రసాద్ దర్శకత్వంలో వి వి అప్పారావు, సి హెచ్ కృష్ణమూర్తి, పాటిబండ్ల స్వరాజ్యలక్ష్మి నిర్మించారు సత్యం సంగీతం, పరుచూరి మాటలు, లక్ష్మన్‌గోరే ఛాయ తెరవెనుక హంగులు స్క్రీన్‌ప్లే, నిర్మాణత వి సత్యనారాయణరాజు

## చిత్రాలకు పేర్లు

శ్రీధర్ దర్శకత్వంలో బి. భరణీరెడ్డి అమెరికాలో నిర్మించే వర్ణ చిత్రానికి ''హరేకృష్ణ -- హలో రాధ'' అని నామకరణం చేశారు కృష్ణ, శ్రీప్రియ, ప్రభాకరరెడ్డి, ప్రకాష్, లతి వగైరా తారాగణం

పి సుబ్రహ్మణ్యం దర్శకత్వంలో తమ్మా మర్రిరెడ్డి కథ రాసి, నిర్మించిన విజయశాంతి వర్ణచిత్రం పేరు ''పున్నమి వెన్నెల'' మురళీమోహన్, ప్రసాద్‌బాబు, కాంతారావు, వంకాయల, కె కె శర్మ, మదన్ మోహన్, మాధవి, రాజేశ్వరి, అపర్ణ, మాధురి, జయవిజయ నటించారు

కె మహేంద్ర దర్శకత్వంలో డాక్టర్ ఎ రఘురామరెడ్డి నిర్మించే శ్రీ సత్పురుషా ఫిలిమ్స్ చిత్రం ''ముల్లు – పువ్వు'' రజనీకాంత్, శరత్‌బాబు, శోభ, జయలక్ష్మి ప్రధాన పాత్రధారులు

బోయిన సుబ్బారావు దర్శకత్వంలో పి గోపాలకృష్ణయ్య నిర్మాతగా కె సి. శేఖర్ సమర్పించే రాజ్‌కమల్ మూవీస్ చిత్రానికి ''సంసార బంధం'' అని పేరు పెట్టారు శ్రీధర్, నారాయణరావు, రవికాంత్, ప్రభ, సుభాషిణి, కె విజయ వగైరా నటవర్గం

శ్రీ లక్ష్మి సినీ చిత్ర నిర్మించే చిత్రం పేరు ''శాంతి నివాస్'' బాబు దర్శకత్వంలో ఉదయభాస్కర్, సైదారెడ్డి నిర్మిస్తున్నారు

మళ్ళీ మీ రోజువారీ పనులు మామూలుగా
చేసుకోవాలని ఆతృతగా ఉందా మీకు?

గ్లాక్సోస్-డి® అలసటను ఎదుర్కొనేందుకు

వెంటనే శక్తిని సమకూరుస్తుంది.




dCA GL 54/TL/Rev



'మావూళ్లో మహాశివుడు'లో
సుభాషిణి, మురళీమోహన్

## మూలిగే నక్కమీద తాటికాయ

ఈ ఏటి బడ్జెట్‌లో సినిమా పరిశ్రమపై అధిక పన్నులు విధింపబడలేదని పరిశ్రమలోని వారంతా తృప్తిగా ఊపిరి పీలుస్తున్న సమయాన హఠాత్తుగా పిడుగులాంటి వార్త అందరినీ కలవరపరచింది ఉపప్రధాని, ఆర్థిక శాఖామాత్యులు శ్రీ చరణ్‌సింగ్ పార్లమెంటులో ప్రతిపాదించిన రాజ్యాంగపు 49వ సవరణబిల్లువల్ల ప్రతి ఘట్టం కొనూ అమ్మకం పన్నుకు లోనై, అసలే అనేక బరువు భారాలకు లోనవుతున్న చిత్ర పరిశ్రమ మరింత క్రుంగి కృశించిపోగలదన్న భయాందోళన నెల్లెడలా వ్యాపించింది నిర్మాతలు పంపిణీ దారులకు, వారు ప్రదర్శన శాలలకు చిత్రాలను అద్దెకు ఇవ్వగంమీదేకాక, ఆఖరికి టిక్కెట్లమీద కూడా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అమ్మకం పన్నును, విధింపడాన్ని బలపరిచే ఈ బిల్లు చిత్ర పరిశ్రమకు ఎంతైనా హానికరం కాగలదు

# సినిమా

## సంక్షిప్త సమాచారం

కె బాలచందర్ దర్శకత్వంలో కానూరి రంజిత్‌కుమార్ నిర్మించే రంజిత్ ఆర్ట్స్ చిత్రంలో సీమ, సరిత ఇంతవరకు ఎన్నికయ్యారు

యు సూర్యనారాయణబాబు సమర్పణలో బి బి బెనర్జీ నిర్మించే కుమారరాజా పిక్చర్స్ చిత్రానికి, ఏడిద నాగేశ్వరరావు త్వరలో ప్రారంభించే మరో చిత్రానికి భారతీ రాజా దర్శకుడు

శ్రీ వాసవీ ప్రొడక్షన్స్ వర్ణ చిత్రంలో గౌతమబుద్ధుడుగా విజయచందర్ అయిదున్నర నిమిషాల అంతర్నాటకంలో దర్శనమిస్తారు. నూతన్‌ప్రసాద్, నాగభూషణంతోపాటు రంగస్థలానుభవం గల శివకుమార్ అనే నవనటుడు ఈ చిత్రంలో ఒక ముఖ్య భూమికను నిర్వహిస్తున్నారు గూనా నాగేంద్రప్రసాద్ దర్శకత్వంలో నూరి రంగయ్య, పులిపాటి వెంకటేశ్వర్లు ఈ చిత్ర నిర్మాతలు

దవళ సత్యం దర్శకత్వంలో ఆర్ ఎస్ రామరాజు నిర్మాతగా చెరుకూరి జనార్దనరావు సమర్పించే సౌమ్య సినీ ఆర్ట్స్ ద్వితీయ చిత్రం ''జాతర''లో శ్రీధర్, చిరంజీవి, నాగభూషణం, పి ఎల్. నారాయణ, జయలక్ష్మి, లీలావతి తారాగణం ఎం జి రామారావు సంభాషణలకర్త జి కె వెంకటేశ్ సంగీత దర్శకుడు ఉదయరాజ్ ఛాయాగ్రాహకుడు నిర్వహణ లక్ష్మీపతి

బి నాగిరెడ్డి హిందీలో నిర్మించే విజయావారి ''గుండమ్మ కథ'' వర్ణ చిత్రానికి పర్వతనేని సాంబశివరావు దర్శకుడు సంజీవ్‌కుమార్ (ఎన్ టి ఆర్), శశికపూర్ (ఎ ఎన్ ఆర్), విద్యాసిన్హా (సావిత్రి), మౌసుమిఛటర్జీ (జమున) పాత్రలు ధరిస్తున్నారు రాజేష్ రోషన్ సంగీత దర్శకుడు ఆగస్ట్ నుంచి షూటింగ్ ప్రారంభం

నవత ఆర్ట్స్ ''ఇంటింటి రామాయణం'' చిత్రాన్ని కూడా హిందీలో నిర్మించే హక్కులు బి. నాగిరెడ్డి కొన్నారు దీనికీ పర్వతనేని సాంబశివరావే దర్శకుడు

రాంబ్రొహ్ ''సీతాపతి సంసారం'' చిత్రాన్ని హిందీలో కోటారెడ్డి దర్శకత్వంలో నిర్మిస్తారు దాసరి దర్శకత్వంలో ''భారతంలో ఒక అమ్మాయి'' చిత్రాన్ని కూడా హిందీలో నిర్మించే ఉద్దేశ్యం రాంబ్రొహ్‌కు ఉంది ఇందులో జితేంద్ర, శత్రుఘ్నసిన్హా, హేమమాలిని ముఖ్య పాత్రధారులు

''శివరంజని'' చిత్రాన్ని తారకప్రభు ఫిలిమ్స్ సంస్థ హిందీలో దాసరి దర్శకత్వంలో నిర్మిస్తుంది దాసరి ''స్వర్గం - నరకం''లో ధరించిన పాత్రకు హిందీలో త్రిపాఠి అని పేరు ఆ తర్వాత త్రిపాఠి కథ ఏమిటన్న విషయంపై ''స్వర్గ్ నరక్ కే బాద్'' అనే మరో హిందీ చిత్రం కూడా తయారౌతుంది ''శివరంజని''లో సంజీవ్‌కుమార్, హేమమాలిని ముఖ్యభూమికలు నిర్వహిస్తారు ★

'వినాయక విజయం'లో వాణిశ్రీ



# ముద్దు బిడ్డ మొదటి ఘన ఆహారం. ఇందులో సులభంగా జీర్ణమయ్యే బియ్యం, పుష్టికరమైన 11 విటమినులు, మరియు యినుము కలిసివున్నాయి

# నెస్టమ్

## బిడ్డలకై తయారు చేయబడిన బియ్యపు సారం.

మీ ముద్దు బిడ్డకు ఘన రూపమైన ఆహారం పెట్టడం ప్రారంభించారంటే, ఆ బిడ్డకు మంచి పుష్టినిచ్చే ఆహారం యివ్వండి అంతేకాదు ఆ ఆహారం అతి సున్నితమైన ఆ బిడ్డ జీర్ణావయవముల మీద తేలికగా పనిచేసేదిగా కూడా వుండాలి సులంభంగా జీర్ణమయ్యే ధాన్య ఆహారం బియ్యమేనని డాక్టర్లు అంగీకరించారు. అందుచేతనే మేము బియ్యంతో నెస్టమ్ క్రీమ్ తయారు చేశాము. ఇందులో మీ బిడ్డ ఆరోగ్యంగా పెరుగుటకు ముఖ్యంగా అవసరమైన విటమినులు ఇనుము తగినంత పాళ్లలో చేరియున్నది

మీ ముద్దు బిడ్డకు 3 నెలలు నిండగానే యీ ఆహారం యివ్వడం ప్రారంభించవచ్చు బిడ్డ పెరిగే కొద్దీ, యీ ఆహారానికి పండ్లు, కాయగూరలు, ఉప్పు, కలిపి, క్రొత్త క్రొత్త రుచులు చవి చూపించవచ్చు మెల్ల మెల్లగా.




బిడ్డల జీర్ణ విధానమునకు యెంతో అనువైనది. బిడ్డల పెరుగుదలకు చాలా చక్కనిది.



గరిష్ఠ ధర
రు. 7-00
స్థానిక పన్నులు
అదనం.

**పూర్తి పోషక పదార్థములతో సులభంగా జీర్ణమగు నిండు ఆహారాన్ని తయారు చేయుటకై దీనిని పాలతో కలపండి.**



ముందుగా కాచియుంచిన పాలను వంచుకోండి.



దానికి నెస్టమ్ కలపండి.



వెంటనే యిచ్చుటకు తయారు




SAA/FSL/N/1134





అనగనగా ఒక రాజు. ఆయనకు పదకొండు మంది కొడుకులు, ఒక కూతురు వున్నారు కూతురు అందరికన్నా చిన్నది చిరుదరి పన్నతనంలో రాణి చనిపోయింది తర్వాత పిల్లల ఆలనా పాలనా చూడటానికి, రాజ్యభారం వల్ల రాజుకి తీరికలేకుండా పోయింది అందువలన ఆయన మళ్ళీ పెళ్లి చేసుకోక తప్పలేదు రెండవ భార్య ఒక మాయలమారి ఆమెకు ఈ పదకొండు మంది కొడుకులన్నా, కూతురన్నా ఇష్టం వుండేదికాదు వాళ్లను నానా ఇబ్బంది పెట్టేది బాధించేది సాధించేది అయినా పిల్లలు ఇవన్నీ తండ్రి ప్రేమానురాగాలలో మర్చిపోయి హాయిగా వుండేవారు సవతి తల్లిమీద ఏ విషయమూ రాజుతో చెప్పేవాళ్ళు కాదు

రోజులు గడుస్తున్నకొద్దీ మాయలమారికి పిల్లలమీద ద్వేషం పెరగసాగింది ఒకనాడు రాజులేని సమయంలో తనకు కొద్దిగా తెలిసిన మాయలతో పదకొండు మంది రాజకుమారులను భయంకరమైన పక్షులుగా మారిపోవాలని కోరుకుంది కానీ వాళ్ళు ఆమె కోరుకున్న విధంగాకాక, అందమైన తెల్లని హంసల్లా మారిపోయారు వాళ్లకు పూర్తిగా చెడు చేయాలనుకుంది కానీ, వాళ్ళు మంచివారవడంచేత అలా చేయలేకపోయింది సవతి తల్లి బాధలు భరించలేక, తాము మళ్ళీ మానవరూపాలు పొందడానికి మార్గం వెతుక్కుంటూ ఎగిరి వెళ్ళిపోయారు, పదకొండుమంది రాజకుమారులు సవతితల్లి ఎంతో సంతోషించింది

ఇక రాజు కూతురు మాత్రం మిగిలింది ఆమె పేరు ఎలిజా.

రాజు తిరిగివచ్చిన తర్వాత రాజకుమారుల మీద లేనివన్నీ కల్పించి చెప్పింది తనను ఎంతో అవమానపరచారని ఏడ్చింది సవతి తల్లిని అవమానపరచినందుకు రాజు తమను దండిస్తాడన్న భయంతో వారు పారిపోయారని చెప్పింది. రాజు నమ్మి వూరుకున్నాడు

ఎలిజా పెరుగుతున్నకొలదీ ఆమె అందం రెట్టింపుకాసాగింది. ఆమె అందం చూసి మాయలమారి అసూయ చెందింది అన్నలలాగే, ఆమెకూడా రాజ్యం వదిలి వెళ్ళేలా చేయాలనుకుంది అవకాశం కోసం ఎదురు చూడసాగింది.

ఒకరోజు తోటలో మూడు కప్పలను పట్టుకొని, తన మంత్రశక్తిచేత వాటితో మాట్లాడింది 'మీరు ముగ్గురూ ఎలిజా స్నానంచేసే తొట్టెలో దూరి, ఆమె శరీరాన్ని బాగా గాయపరచి, వికృతంగా మార్చాలి' అంది అవి సరే అని తలలు వూపాయి

అవి తొట్టెలో దూరాయి ఎలిజా స్నానం చేయడానికి తొట్టెలో దిగింది కప్పలు ఆమె అందమైన రూపాన్ని చూసి, ఆమెను గాయపరచడానికి ఇష్టంలేక మెత్తని గులాబీలుగా మారిపోయాయి ఈ విషయాన్ని గమనించి మాయలమారి కుళ్ళిపోయింది ఎలాగైనాసరే ఎలిజాను వికృతంగా తయారుచేయాలని అనుకుంది

ఎలిజా రాత్రి నిద్రపోతున్న సమయంలో మాయలమారి ఆమె గదిలోకి వెళ్ళి ఆమె మొహంనిండా నల్లని జిడ్డు పూసింది. జుత్తును అసహ్యంగా కత్తిరించింది. ఎలిజా నిద్రలేచి తన రూపాన్ని అద్దంలో చూసుకుని భయపడింది. తన రూపం అంత వికృతంగా మారిపోయినందుకు చాలాసేపు ఏడ్చింది ఆమె అలా ఏడవడంవల్ల మొహం వుబ్బి, కన్నీళ్లతో మొహం మరింత జిడ్డుగా తయారైంది.

మాయలమారి వెంటనే రాజు దగ్గరికి పరుగెత్తుకుంటూ వెళ్ళి 'ఎలిజా పారిపోయింది ఆమె స్థానంలో మరొక పల్లెపిల్ల వుంది.' అని చెప్పింది రాజు భార్య మాటలను నమ్మక స్వయంగా ఎలిజాను చూడడానికి వెళ్లాడు వికృత రూపంలో వున్న కూతుర్ని గుర్తించలేకపోయాడు రాజు ఆమెను రాజ భవనం నుండి బయటకు వెళ్లగొట్టించాడు

ఎలిజా విచారంతో అడవి మార్గం



బాలి

ఎట్టింది ఎప్పుడో పారిపోయిన అన్నలను వెతకాలనుకుంది వాళ్ళు హంసల్లా మారిపోయిన విషయం ఆమెకు తెలియదు ఆమె అలా అడవుల్లో దొరికింది తింటూ, నిదవున్నచోట నిద్రపోతూ చాలా దూరం ప్రయాణం చేసింది అన్నలు కనిపించే ఆశ ఆమెకు కనిపించలేదు

అడవిలో ఒకరోజున ఓ అవ్వ కనిపించింది ఆమె ఎలిజాను చూసి జాలిపడింది. ఇంటికి తీసుకెళ్ళి స్నానంచేయించి తల దువ్వింది తన దగ్గరున్న పళ్ళను ఇచ్చి, 'ఎవరికోసం వెతుకుతున్నావూ ?' అడిగింది. 'మా పదకొండుమంది అన్నయ్యలకోసం – నీకు కనిపించారా ఎక్కడైనా ?' అంది.

'నాకు కనిపించలేదు. కాని పదకొండు అందమైన హంసలను నిన్న చూసాను వాటి తలలమీద బంగారపు కిరీటాలున్నాయి అవి ఈ దగ్గరలోనే వున్న నదిలో స్నానం చేస్తుండగా చూసాను' అంది.

అవ్వ చెప్పిన నది దగ్గరకు వెళ్ళింది, ఆ అందమైన హంసలను చూద్దామని. అప్పటికి సాయంత్రమయింది. పదకొండు హంసలు ఎస్తూ కనిపించాయి ఎలిజా వాటిని చూసి ఆనందపడింది హంసలన్నీ నది ఒడ్డున దిగాయి అప్పుడే సూర్యాస్తమయం అయింది అప్పుడొక అద్భుత సంఘటన జరిగింది హంసలన్నీ రాజకుమారులుగా మారిపోయాయి. వాళ్ళు బాగా పెద్దవాళ్ళు అయినప్పటికీ, ఎలిజా తన అన్నలను గుర్తించింది వాళ్లను పేరుపెట్టి పిలిచింది. వాళ్ళు చెల్లెలును గుర్తించారు. అందరూ ఎంతో సంతోషించారు. సవతితల్లి వలన తాము ఈ రూపాన్ని పొందామనీ, సూర్యాస్తమయం తర్వాత కొన్నిగంటలవరకు మానవరూపం వస్తుందని, పగలు మామూలుగా హంసలు అయిపోతామనీ చెప్పారు అన్నలు

సవతితల్లి తనకు చేసిన పని ఎలిజా అన్నయ్యలకు చెప్పింది 'నన్నుకూడా మీతోపాటు తీసుకెళ్ళండి' అంది. వాళ్ళు ఒప్పుకున్నారు. అడవిలో దొరికిన పూలతీగలతో వల అల్లి సిద్ధపరచారు అందులో నిద్రపోతున్న ఎలిజాను పరుండ పెట్టారు.

తెల్లవారింది రాజకుమారులు మళ్ళీ హంసల్లా మారిపోయారు హంసలు తమ నోటితో వల అంచులను పట్టుకొని ఆకాశంలోకి ఎగిరాయి సముద్రంమీద ఎగురుతూ చాలా దూరం ప్రయాణంచేసి, చివరకు ఒక పచ్చని కొండ ప్రాంతంలో దిగాయి

ఎలిజాకు మెలకువ వచ్చేసరికి, ఆమె ఒక గుహలో వుంది హంసలు పనిమీద వెళ్ళిపోయాయి ఎలిజా చాలాసేపు ఆలోచిస్తూ వుండిపోయింది, తన అన్నలకు మళ్ళీ పూర్తిగా మానవరూపం ఎలా తీసుకురావాలా

(34 వ పేజీ చూడండి)



సీరియల్

# ఇదీ ఒక పాంథశాల

శ్యామల

కొన్ని యూరోపియన్ దేశాలతో చేసుకున్న ఒప్పందాల ఫలితంగా 8 వారాలపాటు శిక్షణ కొరకు ఆరుగురిని హాలెండ్‌కి పంపవలసి ఉంది సెలెక్ట్ కాబడిన ఆరుగురిలో విజయ్ కూడా ఉన్నాడు

సెలెక్ట్ కావటమే గర్వకారణం ఆ ఆరుగురికీ! మొదటిసారిగా విదేశీ పయనం! క్రొత్త దృశ్యాలు చూస్తామని సంతోషం! క్రొత్త అనుభవాలు పొందాలని ఆరాటం! ఉత్సాహంగా సిద్ధమయాడు విజయ్

కాని సంధ్య? ప్రాణంలో ప్రాణమయిన సంధ్యను విడిచి ఇక్కడ ఉండటమే బాధాకరం వదిలిపెట్టి వెళ్ళటమంటే ప్చ్! రాధకు — చిన్నారి రాధకు — అంత దూరంగా వెళ్ళిపోవటమే?

వీలు చిక్కినప్పుడల్లా — ఒక్క రోజు ఖాళీ దొరికినా — వెళ్ళి వాళ్ళను చూసి వస్తున్నాడు ఇప్పుడు అంత దూరం వెళ్ళాలి

అయినా ఎన్నాళ్ళని? ''జస్ట్ టూ మంత్స్!''

హైద్రాబాదులోనే ప్లేను ఎక్కాడు ఢిల్లీలో ఆరుగురూ కలుసుకొని ఒక బాచ్‌గా వెళ్ళాలని నిశ్చయమయింది

ఎయిర్‌పోర్ట్‌కి సంధ్య, రాధ, తల్లిదండ్రులు, అత్తమామలు, నిర్మల, రవి, సునీల్, మీనా అంతా వచ్చారు ఆప్యాయంగా వీడ్కోలిచ్చారు కన్నీళ్ళు తిరుగుతున్నా, అవి బయటపడరాదని విశ్వప్రయత్నం చేస్తూ చిరునవ్వుతో గుడ్‌బై చెప్పింది — సంధ్య

ఎయిర్‌పోర్ట్‌కి వచ్చేముందర గదిలో ఒంటరిగా ఉన్నప్పుడు పెదవులపైన అతని స్పర్శ ఇంకా వెచ్చగా ఉన్నట్లే అనిపిస్తుంది

ఇంటికి వచ్చాక గదిలో కూర్చొని కరువుతీరా ఏడ్చింది ఇన్నాళ్ళూ వేరుగానే ఉన్నా ఆ పరిస్థితి వేరు ఇప్పుడు తామిద్దరిమధ్యా ఎన్నో వేల మైళ్ళు, ఎన్నో దేశాలు, ఎంతో దూరం ఉందనుకుంటే దుఃఖం ఆగటంలేదు

నిర్మల, రవి లోపలికి వచ్చారు ''పిచ్చి మొద్దూ, ఏమిటా ఏడుపు?'' కోప్పడింది నిర్మల ''ఎనిమిది వారాల కోసం ఈ బాధేమిటి?''

''ఎనిమిది వారాలని కాదక్కా! మా యిద్దరి మధ్యా ఎంత దూరం —''

''మనసుల మధ్య దూరం లేదుకదే! ఎందుకా ఏగులు?'' నవ్వింది నిర్మల

(గత సంచిక తరువాయి)

''అక్కడి అమ్మాయిలు చాలా అందంగా ఉంటారుట సంధ్యా! ఒళ్ళు దగ్గరపెట్టుకొమ్మని గట్టిగా చెప్పానులే విజయ్‌కి!'' నవ్వుతూ అన్నాడు రవి

''మా ఆయనమీద నాకలాంటి అపనమ్మకాలేమీ లేవు!'' కోపంగా అంది సంధ్య

''నాకు మాత్రం నీమీద అపనమ్మకమే రవీ, నిన్ను మాత్రం ఎప్పటికీ అందమైన అమ్మాయిల మధ్య వదిలిపెట్టను సుమా'' అంది నిర్మల

''అందుకే నాలాంటివాళ్ళకు అటువంటి ఛాన్సులూ రావు'' విచారం నటిస్తూ రవి అనటంతో అంతా నవ్వేశారు

* * *

మనోహరమైన సాయం సమయం ఆమ్‌స్టర్‌డామ్ నగరం అందంగా ముస్తాబయింది అది హాలెండు దేశపు రాజధాని ఆ ఊరంతా వాగులు ప్రవహిస్తూనే ఉన్నాయి

ఎక్కడ చూసినా వంతెనలే సముద్రానికి ఒడ్డు నేవున్న ఆ ఊరు సముద్ర తీరానికంటే లో లెవల్‌లో ఉండటం ఒక విశేషం

అప్పుడప్పుడు ఊర్లోకి సముద్రపు నీరు వచ్చేసేదిట అందుకని సముద్ర తీరాన ఎత్తైన గోడలు కట్టుకున్నారు

**జరిగిన కథ - 6.** అక్క నిర్మల, బావ రవిల సంరక్షణలో ఉంటున్న సంధ్యకు 'అట్టావా'లో ఉద్యోగం రాగా విజయ్‌కి తనకు జరిగిన వివాహ పూర్వాపరాలు గుర్తుకువస్తాయి నిర్మలను చూడటానికి వచ్చినపుడే మనసులు కలిసి రిజిష్టరు మేరేజి చేసుకున్న విజయ్, సంధ్యల జీవితం సాఫీగా సాగుతుండగా, విజయ్ మిలటరీలో ఉద్యోగానికి లోగడే దరఖాస్తు చేసాడని తెలుసుకొని విస్తుపోతుంది సంధ్య విజయ్ స్నేహితుడు రవితో నిర్మలకు పరిచయమౌతుంది విజయ్‌కి ఎయిర్‌ఫోర్స్‌లో ఇంటర్‌వ్యూకి వెళ్ళి తిరిగివచ్చిన తరువాత, జాబ్ వస్తే జేరటానికి సంధ్య తన సంతోషాన్ని వ్యక్తపరుస్తుంది. విజయ్, సంధ్యలు కూతురుకు రాధా అని పేరు పెట్టుకుంటారు తమ ప్రేమించిన మీనా ముఖం మశూచికంవల్ల వికృతంగా మారటంతో సునీల్ సంధ్య సలహా తీసుకుంటాడు

యుద్ధ సమయంలో శత్రువులు ఆ ఊరిని గెలిచేస్తారేమో ననిపించినపుడు ప్రజలంతా ఊరిని వదిలిపెట్టేసి వెళ్ళిపోయేవారుట పోతూ పోతూ గోడలు పగులకొట్టి వెళ్ళేవారుట ఊరంతా సముద్రపు నీరుతో నిండిపోతే శత్రువులు మాత్రం వెనక్కి వెళ్ళక ఏం చేయగలరు?

ఊరినిండా వాగులు, సముద్రంకంటే పల్లాన ఉండటం — ఇంతకుమించిన విశేషం అక్కడి ప్రజల మనస్తత్వం

డచ్ జాతి ధైర్యానికి పేరు పొందినది అతిథి మర్యాదలకు వారిని గొప్పగా చెప్పుకుంటారు

ప్లేను దిగి వస్తూనే విజయ్ వారి స్నేహాన్ని ఫీల్ అయినాడు

ట్రైనింగ్ కొరకు సెలక్టు చేసిన ఆరుగురిలో విజయ్ ఒక్కడికే ఆమ్‌స్టర్ డామ్‌లో పని ఉంది అక్కడి మెషనరీని ఇన్‌స్పెక్ట్ చేయవలసిన డ్యూటీ అతనిది నలుగురు ఎయిర్‌ఫీల్డ్‌తో పైలెట్ ట్రైనింగ్‌కి దూరాన ఉన్న మరొక ఊరికి వెళ్ళారు మరొకతను పది రోజులకు ఇండియాలో బయల్దేరి విజయ్‌ని కలుసుకొన్నాడు

ఆమ్‌స్టర్‌డామ్ ఎయిర్ పోర్ట్‌లో హోటల్ వివరాలు తెలుసుకొని, ఆ ఊరి మాప్ తీసుకున్నాడు అతనికి సరిపోయే స్తోమతులో కావలసిన లొకేషనులో హోటల్‌ని సెలెక్ట్ చేసుకోవటానికి సాయం చేసింది అక్కడి రిసెప్షనిస్టు ఆ హోటల్‌కి ఫోన్ చేసి రూం కూడా బుక్ చేసింది

హోటల్ చేరుకున్నాక వేడినీళ్ళతో షవర్ తీసుకునేసరికి నిద్ర ముంచుకు వచ్చింది పక్క మీద వాలగానే కళ్ళు మూసుకుపోయాయి

సాయంత్రం నాల్గుగంటలకు మెలకువ వచ్చింది ఓ నిమిషంపాటు తను ఎక్కడున్నదీ అర్థమవలేదు గులాబి రంగు తెరలు — గులాబి పూల దుప్పటి — నేలపైన మెత్తని తివాసీ కుర్చీలు, టేబుల్ మొదలైన చక్కని ఫర్నిచర్ - ఇది కలకాదు! మొన్ననీపాటికి సంధ్య సన్నిధిలో ఉన్నాడు ... నిన్న మబ్బులపైన స్వారీ చేస్తున్న విమానంలో... ఈ రోజు అందమైన ఈ గదిలో. ఎంత విచిత్రంగా ఉంది!

ఆకలిగ అనిపించింది టేబిల్‌పై నున్న ఫోను ఎత్తి ''ఏదయినా తినటానికి పంపించమని'' క్రింద హాల్‌లోని లేడీని అడిగాడు పదినిమిషాల్లో ట్రే చేతిలో పెట్టుకొని వచ్చింది ఒక వెయిట్రస్

ట్రేలోని శాండ్ విచెస్ తింటుంటే పక్క సర్దింది ఆ అమ్మాయి తర్వాత పాట్‌లోని కాఫీ కప్పులో పోసి యిచ్చింది

''థాంక్‌యూ'' అని కప్పు తీసుకుంటూ ఆమె ముఖంలోకి చూశాడు

గుండ్రని ముఖంలోని కళ్ళు తననే చూస్తున్నాయి పెదవుల పైన చిరునవ్వు స్నేహపూర్వకంగా ఉంది తనూ చిన్నగా నవ్వాడు చూపులు కలవటంతో మాటలు మొదలుపెట్టింది ''మీరు చాలా రోజులుగా మా దేశంలో ఉంటున్నారా?''

''లేదు! ఈ ఉదయమే వచ్చాను''

''రియల్లీ? హియర్ ఈజ్ వెల్‌కం ఫ్రం ఏ

## లక్మే వ్యానిషింగ్ క్రీమ్‌తో 'నిన్ను ప్రేమిస్తున్నాను' అని గుసగుసలాడే చర్మం




లక్మే వ్యానిషింగ్ క్రీమ్

లక్మే వ్యానిషింగ్ క్రీమ్. ఇది మేకప్‌కు, పౌడర్ చేస్‌కు ఎంతో చక్కనిది. మీ ముఖంపై సున్నితంగా రక్షణనిచ్చే అనురాగ స్పర్శలా...ఏ వాతావరణంలో నైన సరే. ఎప్పుడైనా సరే.. మీ రూపం అందంగా, తాజాగా, దోషరహితంగా రూపొందేందుకు.

చర్మ రక్షణ గురించి తెలిసినవారు

లక్మే

daCunha/L-VC/LT/5 TL

# ఇది ఒక పాంధశాల

్రెండ్'' అంటూ కరచాలనం కొరకు చేయి చాపింది

ఆమె వేళ్ళు మెత్తగా, వెచ్చగా తగిలాయి ఆ చేయి వదలాలనిపించలేదు విజయ్‌కి

''నా పేరు రీనావిల్స్ రీనా అని పిలవండి చాలు నేను వెళ్ళాలి '' ఖాళీ ప్లేటు ట్రేలో సర్దేస్తూ అంది

''నాకు చిన్నప్పటినుంచి విదేశీయులంటే ఫాసినేషన్ మీ దేశం గురించి తెలుసుకోవాలని ఉంది ''

''అయామ్ గ్లాడ్ ! నేను ఇక్కడే కొన్నాళ్ళు ఉంటాను'' అన్నాడు విజయ్

''నువ్వేం చదువుకున్నావు ?'' ఉన్నట్లుండి అడిగాడు

''హైస్కూలు పూర్తిచేయలేదు సంపాదించవలసిన అవసరం వచ్చింది దాదాపు ఏడాదిగా ఇక్కడే పనిచేస్తున్నాను నాకు ఇంగ్లీషు ఎట్లా వచ్చిందని ఆలోచిస్తున్నారా ? స్కూల్‌లో నేర్చుకున్నది కొంచెమే కాని నా ఫియాన్స్ బ్రిటిషర్, అందువలన బాగా వచ్చింది భాష ఇంగ్లీషు వచ్చును కనక విదేశీయులకి నేను సర్వ్ చేస్తాను సాధారణంగా

''మీరేం చదువుతున్నారు ? ఈ దేశంలో ఎన్నాళ్ళుంటారు ?''

సాధారణం పాశ్చాత్యులు ఎవరి విషయాలు ఆరా తీయరు అలాగే తమ విషయాలూ ఎవరికి చెప్పరు ఈ అమ్మాయి విభిన్నంగా ఉంది

''నేను ఇంజనీరుని గవర్నమెంట్ పంపించ వచ్చాను ఇక్కడికి . చూడు రీనా, రేపటినుంచికాని నా వర్క్ మొదలుకాదు ఈ సాయంత్రం




గడపటానికి మంచి సజెషన్ ఇవ్వు ఏదయినా ''

రెండు నిమిషాలు ఆలోచించింది రీనా ''టూరిస్ట్ ఎట్రాక్షన్స్ ఇక్కడ చాలానే ఉన్నాయి అవన్నీ మెల్లిగా వీక్‌ఎండ్స్‌లో చూసుకోవచ్చును ఈ సాయంత్రానికి అలా వంతెనలపైన నడుస్తూ, డచ్ మనుష్యులను చూస్తూ, కాస్సేపు వాగుల పైన షికారు చేస్తూ గడిపేస్తే రిఫ్రెషింగ్‌గా ఉంటుంది నిజానికి బోటింగ్ మా ఫేవరట్ హాబీ . పెళ్ళయినాక బోటు హౌస్‌లో ఉండా లనేది నేను, తనూ అనుకుంటున్నాం జిమ్ అంటే నా ఫియాన్సీ అతను ఆర్టిస్ట్ '' ఆ సీను చెప్తున్నప్పుడు ఆమె కళ్ళలోకి మెరుపు రావటం గమనించాడు విజయ్. అది ఎంతో ముచ్చటగా అనిపించింది

''అతన్ని గురించి చెప్పు !'' చిరునవ్వుతో అడిగాడు

''మరోసారి'' అనేసి వెళ్ళిపోయింది నవ్వుతూ

విజయ్‌కి చాలా రిలాక్స్‌డ్‌గా అనిపించింది రాగానే మంచి హోటల్‌లో ఫిక్స్ అవటం, పరిచయమైన మొదటివ్యక్తి ఇంత స్నేహంగా ఉండటం- కాగితం తీసి సంధ్యకి లెటర్ మొదలు పెట్టాడు ఆ ఉదయం ఎయిర్‌పోర్ట్‌లో దిగుతూనే క్షేమంగా చేరినట్టు నాన్నగారికి, సంధ్యకి టెలిగ్రామ్స్ యిచ్చాడు

భార్యకి, కూతురికి ముద్దులతో ఉత్తరం ముగించేసరికి గంట పట్టింది

తర్వాత డ్రస్ చేసుకొని క్రిందికి వచ్చాడు అది పెద్ద హోటల్ విశాలమైన లాబీలో చాలానె షాపులు, ఓ చిన్న పోస్టాఫీసు ఉన్నాయి కవర్లు, స్టాంపులుకొని ఉత్తరాలు పోస్ట్ చేశాడు తర్వాత లాబీలోని ఒక సోఫాలో కూర్చొని అక్కడ తిరుగుతున్న జనాన్ని చూడసాగాడు

లోపలికి వచ్చేవాళ్ళు, బయటకు వెళ్ళేవాళ్ళు, షాపింగ్ చేస్తున్నవాళ్ళు, చిన్న గుంపులుగా నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నవాళ్ళు—అంతా సందడిగా, గొడవగా ఉంది చాలామంది మగవాళ్ళు కోట్లు, టైలతో ఉన్నారు స్త్రీలు మినీ స్కర్ట్స్‌లో మళ్ళీ చూడాలనిపించేటట్లుగా ఉన్నారు స్త్రీ, పురుషులెందరో జంటలుగా నడుములపైన చేతులు వేసుకొని నడుస్తున్నారు

సంధ్యకూడా ఉంటే బాగుండుననిపించింది

అంతలోనే లోపల్నించి బయటకు వస్తున్న ఓ అమ్మాయి పైన దృష్టి పడింది

ఎంత అందంగా ఉంది ! — అనుకోకుండా ఉండలేక పోయాడు

ఊపిరి తీయటం కూడా మరిచిపోయి సంభ్రమంగా చూస్తూ ఉండిపోయాడు

పొడవుగా ఉంది ఆమె కాఫీ కలర్ శాటిన్ డ్రస్‌వేసుకొని ఉన్నది ఆ కలర్‌కి కాంట్రాస్టుగా శరీరం మరింత పసిమిగా మెరుస్తున్నది అంత స్వచ్ఛంగా, నున్నగా — ఉన్న చర్మం ఎన్నడూ చూడలేదు అతను ఏదో కాంతులీనుతున్నట్లే ఉంది భుజాలవరకూ పరుచుకున్న బ్రౌను రంగు జుట్టు కూడా మెరుస్తున్నట్లే ఉంది

ఆమె నడుస్తుంటే మహారాణి నడకలోని

# పాపం, దీనికి అమ్మా నాన్నాలేరు, మనం పెంచుకుందామా!



## టింకూ లాంటి బాబు మీకూ వుంటే రీగల్ కావలసిందేమరి! ఇండియాలో అత్యధిక శక్తి గల డిటర్జెంట్ బట్టల సబ్బు.

టింకూ లాంటి పిల్లలు ఉంటే బట్టలు ఉతికే పని అధికం అందుకు 'రీగల్' మాత్రమే సరయిన డిటర్జెంట్ సబ్బు 'రీగల్'కుగల అధిక తెల్లదనాన్నిచ్చే శక్తి ఎంతటి మురికినైనా తొలగించి, మీ బట్టలను తళతళలాడే తెలుపుతోను, వెలుగుతోను మెరిసేలా చేస్తుంది లోనికి చొచ్చుకొనిపోయి మురికిని తరిమివేయగల–శక్తివంతమైన–నురుగునిచ్చేది 'రీగల్' ఇతర డిటర్జెంట్ సబ్బులన్నిటికన్న ఎక్కువ ఉతుకులు ఇచ్చే 'రీగల్,' మీకు ఎంతో పొదుపుచేస్తుంది.

'రీగల్'ను మీ కుటుంబపు డిటర్జెంట్ సబ్బుగా చేసుకోండి.




Rediffusion D/767e/TL/R

ఉన్నాయి ఉంది. తనవలెనే చాలామంది ఆమెవేపు స్టేర్ చేయటం గమనించాడతను.

ఇదేం గుర్తించనట్లు, ఏదో ఆలోచిస్తూ వచ్చి విజయ్ కూర్చున్న సోఫాలోనే మరొక ప్రక్క కూర్చుంది. కాలుమీద కాలువేసుకొని, తలవెనక్కి వాల్చి తన ఆలోచనల్లో మునిగిపోయింది.

ఆమె తొడలు, మోకాళ్ళు, పాదాలు — అన్నీ పర్ఫెక్టుగా, నిపుణుడయిన శిల్పి శ్రద్ధగా మలిచినట్లు ఉన్నాయి. కళ్ళు వాల్చి ఆ కాళ్ల వేపు ముగ్ధుడయి చూశాడు కొద్ది నిమిషాలు.

అకస్మాత్తుగా సంధ్య మదిలో మెదిలి ఎవరో కొరడాతో చరిచినట్లే అయింది.

తల ఎత్తేసరికి ఆమె తనవైపే చూస్తూ కనిపించింది.

ఆమె చూపులు విచిత్రంగా ఉన్నాయి. తన వైపు చూస్తున్నట్లే ఉంది. కాని తనను దాటి మరేదో చూస్తున్నట్లనిపించింది. తనలోకి చూస్తున్నట్లు — తన మనసు చదువుతున్నట్లు — అనిపించింది. ఎందుకో గిల్టీగాఫీలయి చటుక్కున చూపులు త్రిప్పేసుకున్నాడు.

వచ్చే పోయే జనాన్ని చూస్తున్నా, ఆమె చూపులు తగులుతూనే ఉన్నట్లు ఉన్నాయి.

ఆమె ఇంకా తనను చూస్తున్నదా? లేదా?– తెలుసుకోకుండా అట్టే సేపు ఉండలేకపోయాడు. జాగ్రత్తగా ఆమెవైపు చూశాడు. మళ్ళీ చూపులు కలవటంతో చిన్నగానవ్వాడు, ఆమె తిరిగినవ్వలేదు.

ఏదో అడిగింది డచ్ భాషలో. అతనికి అర్థం కాలేదు. ''ఇంగ్లీషు వచ్చును నాకు'' అన్నాడు ఇంగ్లీషులోనే.

ఆమె అర్థం చేసుకుంది. ''నీవు ఇండియన్‌వా ?'' కాస్త తప్పుల ఇంగ్లీషులో అంది.

''అవును'' ఇంకా ఏదో అనబోయే లోపల

# ఇది ఒక పాంథశాల

చటుక్కున లేచినిల్చుంది.

''నేను వెళ్ళా ...నా ఫ్రెండ్‌వస్తున్నాడు–'' లోపలికి వస్తున్న లావుపాటి వ్యక్తిని చూపించి ముందుకు నడిచింది.

విజయ్‌కి కంగారుగా ఉంది — వెళ్ళిపోతుంది ఆమె! పేరేమిటో, ఎక్కడుంటుందో తెలుసుకోనే లేదు. ఆత్రుతగా అన్నాడు– ''మిస్, మీ పరిచయం చేసుకోవాలని ఉంది.''

క్షణకాలం ఆలోచించి ''ఆల్‌రైట్, రేపు సాయంత్రం ఇక్కడే, ఇదే టైముకి ఉంటాను.''

అప్పటికే దగ్గరకు వచ్చాడు ఆమె మిత్రుడు. ఆమె బుగ్గమీద ముద్దుపెట్టుకొని, చేతులు పట్టుకొని, సంతోషంగా ఏదేదో చెప్తున్నాడు. ఆమె నవ్వుతూ వింటున్నది. మధ్యమధ్యలో నవ్వు మాయమయి బోర్‌కొడుతున్నట్లు చూస్తున్నది. అంతలోనే సర్దుకొని మళ్ళీ నవ్వుతున్నది. అది కృత్రిమమైన చిరునవ్వు అని తెలుస్తూనే ఉంది. కాని ఆమె మిత్రుడు అదేమీ గమనించినట్లేలేదు. ఆపకుండా ఏదేదో మాట్లాడుతూనే ఉన్నాడు. మాటల్లోనే ఆమె నడుంమీద చేయివేసి హోటల్ బయటకు తీసుకు వెళ్లిపోయాడు.

అతని ప్రక్కన ఆమె — ఛ, ఏం బాగాలేదు! ఎర్రని ముఖం, మీసాలు, లావుగా అతను ఏమీ బాగాలేడు. పాలరాతి బొమ్మలాగా ఉంది ఆమె! రేపు సాయంత్రం వరకు తిరిగి కనబడదు. అనుకుంటే ఏమిటో వెలితిగా అనిపించింది. మెల్లిగా లేచి బయటకు నడిచాడు.

క్రొత్త దృశ్యాలని కళ్ళు పరికిస్తున్నా మనసు మాత్రం ఆమెనే స్మరిస్తున్నది — ఎంత నున్నగా ఉంది ఆమె ఒళ్ళు! ఆ కళ్ళు ఎంత అందంగా ఉన్నాయి. పెద్దవి కావు, కాని తేనె రంగులో అదో తీయని భావన చూపరులకు కలిగిస్తున్నది.

తిరిగి తిరిగి హోటల్‌కి వచ్చాడు, సప్పర్‌కి డైనింగ్ హాల్‌కి వెళ్ళాడు.

అక్కడ సర్వ్ చేస్తున్నది రీనా. ''హాయ్'' అని తీయగా నవ్వుతూ పలకరించింది విజయ్‌ని.

అమాయకంగా ఉన్న ఆ ముఖం సంధ్య అమాయకత్వాన్ని తలపుకు తెచ్చింది. గిల్టీగా ఫీలయినాడు. తను ప్రేమించే తనను ప్రేమించే భార్యను, ముద్దుల కూతురిని మనసులో వెనక్కి నెట్టేసి ఇందాకట్నించి చేసిందేమిటి? మరో స్త్రీ సౌందర్యం గురించి ఆలోచిస్తున్నాడు! అతన్ని ఆకర్షించింది ఆమె శరీరం — ప్రకృతి సహజ పరిణామంలోనే ఉంది ఈ ఆకర్షణ. కాని ఇటువంటి ఆకర్షణకు లోనయి, కోరిక సాధిద్దామని చూస్తే — ఇక, తనకు, జంతువులకి ఏమిటి వ్యత్యాసం! పైగా ఆమెతో పరిచయం చేసుకోవాలని చూశాడు... ఆమె ఒప్పుకున్నప్పుడు సంతోషించాడు... రేపు సాయంత్రం కోసం ఎదురు చూస్తున్నాడు... ఛ! ఇదేనా తన సంస్కారం? సంధ్యను అన్యాయం చేయటానికి మనసెలా ఒప్పింది? ఈ క్షణాన కూడా, మనసా, వాచా తను సంధ్యనే ప్రేమిస్తున్నాడు.

కాని... కాని... ఈ నూతన యువతి పట్ల కలిగిన ఈ ఫీలింగ్ ఏమిటి? ఈ ఆకర్షణకు అర్థం ఏమిటి? నచ్చిన మనిషితో పరిచయం చేసుకోవాలనుకోవటమే తప్పా? దానికి తన మనసుకు లేనిపోని అర్థాలను ఆపాదిస్తున్నాడేమో తను —

అన్యమనస్కంగా భోజనం చేస్తున్న అతని వద్దకు వచ్చి ఎదురుగా కూర్చుంది రీనా.

''ఎలా ఉంది మా వూరు ?''

ఎప్పుడూ నవ్వుతూ ఉండటం ఈ పిల్లకి ఓ వరం —

''వస్తూనే నీవంటి అమ్మాయి పరిచయమయినాక ఊరు నచ్చకుండా ఉంటుందా ?''

అంతలోనే కస్టమర్స్ రావటంతో లేచి వెళ్లింది.

రీనాతో తనకు పరిచయమయింది ఈరోజే. కాని ఈ పరిచయం తనలో ఏ అలజడీ కలిగించటం లేదు. ఎటువంటి తప్పు చేస్తున్న భావనా లేదు. స్నేహంగా మాట్లాడింది ఆమె. తనూ అలాగే మాట్లాడాడు. రేపు సంధ్యకి రాసే లెటర్‌లో ఈ పరిచయం విషయం రాస్తాడు. ఇందులో దాచుకోవలసిందేమీలేదు.

కాని ఆ యువతి - తేనెరంగు కళ్ళతో తనను కదిలించిన కవ్వించిన యువతి — పేరయినా తనకు తెలియదు — తనలో ఏవేవో కోరికలు, తను కోరకూడని కోరికలు — రేపుతున్నది! తనను గిల్టీగా ఫీలయేటట్లు చేస్తున్నది! ఏమిటిదంతా? తనకు ఈ మాత్రం నిగ్రహం లేదా? తనంటే తనకే చిరాకనిపించింది. అంతలోనే సంధ్య, స్ఫటికంలాగా మెరిసిపోతూ కనిపించింది మనసులో. ఎన్నడూ లేనిది తనలో ఏమిటీ అలజడి ?

# "లయన్స్" సినిమా అభిరుచి: "చెవిటి - మూగ"వారికి స్కూలు

విద్యావంతులై వాణిజ్య రంగంలో రాణించేవారు చాలమంది "సింహా"ల క్లబ్‌ల్లో సభ్యులై ఉంటారు ఈ లయన్స్ వీరి అనుబంధ అనుచరులు 20 వేల మందికి పేరు పేరునా సినిమా బ్యాలట్ పత్రాలు పోస్టు చేసి విజయవాడ లయన్స్ క్లబ్‌వారు '78 సంవత్సరపు ఉత్తమ నటీనట వర్గాన్ని "మొట్ట మొదటిసారి" ఎంపిక చేసి, ధమ్సప్" శీతలపానీయంవారి సహకారంతో యీ విజేత"లందరికీ "అవార్డుల" మహోత్సవం చేసి, దీని మూలంగా వచ్చిన టిక్కెట్ల ఆదాయంతో వీలైతే యీ ఏడాది యీ [జూన్] నెల నుంచే విజయవాడలో "చెవిటి వారికి మూగ వారికి" విద్యా శిక్షణ యిచ్చే స్కూలు ఒకటి ప్రారంభించాలని సంకల్పించామని విజయవాడ లయన్స్' చెప్పారు సుమారు 15 వేల మంది లయన్స్" వారి గృహలక్ష్మిలలో కూడా కలిపి ఎంచుకున్న సినిమాలు సినిమా తారల జాబితా చూస్తే — సెట్టింగులు హంగులు రంగులు ఆర్భాటం గల చిత్రాల కన్నా సీదా సాదా కథ చిత్రాలమీదనే యీ "సంఘసేవా కంకణధారు"లైన "సింహాలు" మొగ్గు చూపించినట్లు గమనించ వచ్చును — (ఇది మధ్య తరగతి అభిరుచికి దగ్గరిగా వుంది !!) సీతామాలక్ష్మి చిత్రాన్ని ఉత్తమ చిత్రంగా, "ఆమెకథ"లో 'జయసుధ"ని 'అమరదీపం'లో కృష్ణంరాజును వీళ్లు నెం 1లుగా ఎన్నుకున్నారు — హాస్యానికి అల్లు రామలింగయ్యతో నువ్వా నేనా ? అన్నట్లు బ్యాలట్‌లో పోటీ పడిన ఎల్లరకొట్టు చిట్టెమ్మలోని, "మాడా" ఉత్తమ '78 సం పు హాస్య నటుడైనాడు - "మాసు" "క్లాసూ" కూడా జయమాలిని విషయంలో ఏకాభిప్రాయం గలవారే అన్నట్లు — జయమాలిని ' ఉత్తమ నర్తకి"గా అవార్డు గెలిచింది—ఈరంకి శర్మ ( చిలకమ్మ చెప్పింది ) '78కి "లయన్స్ ధమ్సప్" దర్శకుడైతే, కె వి మహదేవన్, బాల సుబ్రహ్మణ్యం, సుశీలలు సంగీతానికి ప్రతినిధులు ఈ "లయన్స్" మోహన్ బాబు విలనీని [గోరంతదీపం],నారాయణరావు, మాధవిల సహాయ నటనని కూడా ప్రశంసించారు

ఉత్తమ హాస్య నటి గురించి, రచయిత గురించి అడగటం మరిచిపోయారు కనుక "లయన్స్" ఆ విషయంలో తీర్పు యివ్వలేదు ' ఈ సారి వీళ్లను కూడా ఎన్నుకుంటాం" అని నిర్వాహకులైన లయన్స్ పాంచాల్, భాస్కరరావు, ధరమ్‌చంద్ బినాకియాలు పత్రికలవారి ముందు హామీ యిచ్చారు - కొంతమంది "లయన్స్" తమాషాకి ఉత్తమ హాస్యనటునిగా ఎన్ టి ఆర్ పేర్కొంటే, మరికొందరు ఉత్తమ నటిగా మురళీమోహన్ పేరు రాశారుట కాని చాలమంది బ్యాలట్‌ని సీరియస్‌గా తీసుకున్నారుట జూన్ 10న అవార్డుల సంబరం "టిక్కెట్"లు కొన్నవారికి చూపెట్టి ఆ "రాబడి"ని పైన చెప్పిన మూగ చెవిటి బాలల స్కూలుకి వినియోగిస్తారు -సంబరానికయ్యే ఖర్చులు వివిధ శీతలపానీయ సంస్థలు, లయన్స్ సంస్థలు కలిసి "భరిస్తారు ', ఈ"ప్రెస్ కాన్ఫెరెన్సును కండక్టు" చేయడంలో లయన్స్ యిమధుసూదనరావు, లాల్ మోహన్‌లు చేయూత నిచ్చారు [ ★ ★ ★ ]

---

మర్నాడు సాయంత్రం ఆమెను కలుసుకోవడానికి వెళ్ళ కూడదని, ఆమెతో పరిచయమే చేసుకోరాదని, మరిచిపోవాలని నిశ్చయించుకున్నాడు ఆ నిశ్చయంతో మనసులో ఏదో రిలీఫ్‌గా తోచింది

సప్పర్ పూర్తి చేశాక చాలామంది బాల్కనీలోకి వెళ్ళటంచూశాడు తనూ అక్కడికివెళ్ళాడు కేము కుర్చీలలో కూర్చొని సిగరెట్లు కాలుస్తూ కాఫీ త్రాగుతూ కూర్చొని ఉన్నారు జనం తనూ ఓ కుర్చీలో కూర్చొని సిగరెట్ తీశాడు

రీనా వచ్చింది ఇందాక ధరించిన బ్లూ యూనిఫారమ్‌లో లేదిప్పుడు ఇస్త్రీ చేసిన తెల్లని కాటన్‌ఫ్రాక్‌లో సింపుల్‌గా ఉంది మెడ చుట్టూ ఎర్రని కాలరు ఆమెను మరీ చిన్నపిల్లగా కనిపించేటట్లు చేస్తున్నది చిరునవ్వుతో అంది "నా డ్యూటీ అయిపోయింది ఇంటికి వెళ్తున్నాను మరిగి రేపు ఉదయం కలుద్దాం !"

ఆ అమ్మాయి నవ్వు, తనపట్ల చూపిస్తున్న స్నేహం, తెలియని హాయి కలిగిస్తున్నాయి విజయ్‌కి

"ఎంత దూరం మీ యిల్లు ?" అడిగాడు

"ఒక మైలు ఉంటుంది నా స్నేహితురాలితో కలిసి ఫ్లాట్ ఒకటి షేర్ చేస్తున్నాను "

"ఒక్కదానివీ వెళ్ళగలవా ఇంత చీకట్లో ?"

కిలకిలా నవ్వింది "అఫ్‌కోర్స్, వెళ్ళగలను! పైగా నా కాబోయే భర్త వచ్చే టైమయింది అతనితో కబుర్లు చెప్పుకుంటూ నడిచి వెళ్ళటం అలవాటు" అంటూనే వంగొని క్రిందికి చూసింది అడిగో రాల్ఫ్ ! మీరూ క్రిందికి రాకూడదూ ? రాల్ఫ్‌కి పరిచయం చేస్తాను "

"ఫైన్" అని ఆమెతో కలిసి మెట్లుదిగాడు

రీనాని చూడగానే రాల్ఫ్ ముఖం విప్పారింది నవ్వుతూ ఆమె పెదవులపైన తేలికగా ముద్దు పెట్టుకున్నాడు అది పాశ్చాత్య పద్ధతి అని తెలిసినా విజయ్‌కి క్రొత్తగానే ఉంది

"రాల్ఫ్, ఈయన విజయ్, నా క్రొత్త ఇండియన్ ఫ్రెండ్ రాల్ఫ్ జెంకిన్స్ ఇతను మేం త్వరలో పెళ్ళి చేసుకోబోతున్నాం" అని పరిచయం చేసింది

"హౌ డు యు డూ" అంటూ కరచాలనం చేశాడు రాల్ఫ్

"ఇతనితో పరిచయమయింది ఈ మధ్యాహ్నమే! కాని, రాల్ఫ్, విదేశీయులంటే నాకున్న ఆసక్తి నీకు తెలుసు కదా, అందుకని స్నేహం కలిపేశాను ఆయనకీ నేను నచ్చినట్లే ఉన్నాను. ఫ్రెండ్స్ అయిపోయాం !"

రాల్ఫ్‌కి కూడా రీనావలె 22, 23 ఏళ్ళు ఉంటాయేమో ఆమెలాగే జీవితం పట్ల ఉత్సాహం వెల్లివిరుస్తున్నది అతనిలో

"విజయ్, మా రీనా మిమ్మల్ని బోర్ కొట్టేయలేదు కదా ! ఒట్టి వాగుడుకాయ" అన్నాడు

ముగ్గురూ కలిసి రీనా యింటివైపు నడవసాగారు

"క్రొత్త దేశంలో ఒంటరితనం ఫీలవకుండా చేసింది రీనా వాగుడుకాయి అని వెక్కిరిస్తే నేను ఒప్పుకోను" అన్నాడు విజయ్

"ఇప్పుడు మేమిద్దరం కలిసి నిన్ను టీజ్ చేస్తాం చూడు!" అని రాల్ఫ్‌ని బెదిరించింది రీనా

అంతా నవ్వుకున్నారు

కాస్సేపాగి రీనా అంది, "ఇండియా చాల గొప్ప దేశం మా పాశ్చాత్య దేశాలు ఇంకా ఆదిమ దశలో ఉన్నపుడు — దుస్తులు ధరించకుండా గుహలలో నివసిస్తూ పచ్చి మాంసం తినే స్థితిలో ఉన్నపుడు మీ దేశంలో [illegible] ఉండి వేదాలు వంటి మహా గ్రంథాలు రచించే స్థితిలోకి వచ్చేశాడు భారతీయుడు అందుకే నాకు ఇండియా అంటే ఏదో 'మిస్టరీ' దేశం అనిపిస్తుంది మీ నాగరికత ఎంతో ప్రాచీనమయినది మీ సంస్కృతి ఎంతో గొప్పది గాంధీ పుట్టిన దేశం నాకు మహాత్మా గాంధీ అంటే ఎంత అభిమానమో తెలుసా ? ఈ జన్మలో ఎప్పటికయినా ఆ దేశంలో పాదం పెట్టాలని, గాంధీ సమాధిపైన — 'రాజఘాట్' అంటారు కదూ - ఓ పువ్వు ఉంచాలని ఎంత కోరికో ! గాంధీజీ ఆత్మ కథ 'మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్' అరడజనుమార్లు చదివాను ఇప్పటికి " ఎంతో చూస్తూ 'డ్రీమీ'గా చెప్పింది రీనా

ముగ్ధుడై వింటున్నాడు విజయ్

"పెళ్ళవుతూనే ఇండియాకి తీసుకువెళ్ళాలిట! నాచేత ప్రామిస్ చేయించుకుంది అక్కడ రోడ్ల మీద పాములు, సింహాలు తిరుగుతూ ఉంటాయేమోనని నాకు భయం" నవ్వుతూ అన్నాడు రాల్ఫ్

"ఇండియా పట్ల ఈ మమకారం ఎట్లా మొదలయిందని అడిగితే మాత్రం చెప్పలేను హాలండ్ పట్ల ప్రేమ లేదని అనుకోకండి! హాలండ్ నా కన్నతల్లి, ఇండియా ఆత్మీయమైన స్నేహితురాలు అందుకే మీరు ఇండియన్ అని తెలియగానే ఏదో అభిమానం కలిగింది "

"ఐ యామ్ గ్లాడ్ . సోగ్లాడ్ " ఆనందంగా అన్నాడు విజయ్ "నీతో పరిచయం కావటం నా అదృష్టం రీనా ! క్రితం జన్మలో నువు ఇండియన్ వేమో అప్పుడు నీవు [illegible] సోదరివేమో "

రీనా చిన్నగా నవ్వింది

" 'క్రితం జన్మ' అన్నారు దాన్ని గురించి వివరిస్తారా ?' అడిగాడు రాల్ఫ్

"మా యిల్లు వచ్చేసింది" రీనా అంది

/ ఇంకా వుంది /

అనినికుంటూ. కాసేపటికి మళ్ళీ నిద్ర పట్టేసింది ఆమెకు ఒక కల వచ్చింది అందులో అడవిలో కనిపించిన అవ్వ ప్రత్యక్ష మయింది. 'మీ అన్నలకు పూర్తిగా మానవ రూపం రావాలంటే నువ్వొక పని చెయ్యాలి. నా చేతిలోని మొక్కను చూడు. ఇవి గుహ బయట చాలా దొరుకుతాయి. వీటిని బాగా నలగగొడితే జిగురులా తయారయి, దారంలా సాగుతుంది దానిని నువ్వు వడికి, ఆ దారంతో మీ అన్నలకు చొక్కాలు కుట్టాలి. ఆ చొక్కాలు వాళ్ళు ధరిస్తే, వారి మానవ రూపం వాళ్ళకి వస్తుంది కానీ ఒక విషయం జాగ్రత్తగా పాటించాలి నువ్వు మొక్కలను సేకరించి, చొక్కాలను పూర్తిగా అల్లేవరకు నువ్వు ఒక్క మాటకూడా మాట్లాడ కూడదు అలా మాట్లాడినట్లయితే, నువ్వు చేసే ప్రయత్నం వృథా అవుతుంది అంతేకాక మీ అన్నయ్యలు వెంటనే మరణిస్తారు' అంది

ఎలిజా మేలుకుంది. కలలోని సంగతి బాగా గుర్తుపెట్టుకుంది గుహ బయటకు నడిచింది అక్కడ మొక్కలు కనిపించాయి వాటిని పెరికి గుహలోకి తీసుకువచ్చింది బాగా జిగురు వచ్చేవరకు నలగగొట్టింది అది దారంలా సాగింది దానిని వడికి వుండలుగా తయారుచేసి, ఇక చొక్కాలు అల్లడం మొదలుపెట్టింది

ఒకనాడు ఆ ప్రాంతపు రాజు వేటకు అక్కడకి వచ్చాడు గుహలో వున్న ఎలిజాను చూసాడు పేరు అడిగాడు కానీ ఆమె జవాబు చెప్పలేదు, మాట్లాడకూడదు గాబట్టి ఆమె మూగదని రాజు అనుకున్నాడు. జాలిపడ్డాడు ఈ అడవిలో ఒంటరిగా ఆమె వుండడం ప్రమాదమని భావించి, ఆమెను ఎత్తుకుని తీసుకువెళ్లాడు. ఎలిజా మాట్లాడలేకపోయింది మౌనంగానే అభ్యంతరం పెట్టింది కానీ రాజు ఆమె మిద వుండే ప్రేమకొద్దీ ఆమెను వెంట తీసుకెళ్లాడు ఆమెతోపాటు ఆమె అల్లిక వస్తువులు కూడా తీసుకెళ్లబడ్డాయి

రాజభవనంలో ఆమెకు ఎన్నో ఏర్పాట్లు చేసారు — ఆమె ఆనందంగా వుండటానికి కానీ వాటిని నిరాకరించి, తన అల్లిక పనిలో మునిగిపోయింది

రాజు తాను ఎలిజాను చేసుకోబోతున్నట్టు ప్రకటించాడు ఇది చాలామందికి అసూయ

(27 వ పేజీ తరువాయి)

గలిగించింది. ఎక్కడో అడవిలోవున్న అమ్మాయిని తీసుకునివచ్చి పెళ్ళి చేసుకోవడం రాజభవనంలో చాలామందికి నచ్చలేదు. ఆమె అల్లికపనులు, మౌనంగా వుండడం చూసి ఆమె మనిషి కాదనీ, ఏదో మాయలమారి అని, ఏవో కొన్ని మంత్రాలు, శక్తులు సంపాదించుకునేందుకు, ఈ పనులు చేస్తుందని అభిప్రాయపడ్డారు.

## మంచు వలలు

మనిషి మీద
మబ్బు పొరల్నే కాదు
మంచు వలల్ని కూడా
విసిరే ఋతువులున్నాయి !

సోమరితనం మంచు
సుఖలాలస మంచు
దీర్ఘ నిద మంచు
ఇవన్నీ ప్రమాదించు !

ముందుకు మనం నడిస్తే
మూర్ఛిల్లుతుంది మంచు
మంచు దగ్గర నుంపోవడం
మనిషికి పరాజయం !

మంచుకి దూరంగా పారిపోవడం
మనిషికి నిరంతర విజయం!

*డాక్టర్ మిరియాల రామకృష్ణ*

ఎలిజా అప్పటికి పది చొక్కాలను పూర్తిచేసింది ఇంకా ఒకటి అల్లాలి. దానికి తన దగ్గర వున్న మొక్కలు అయిపోయాయి. వాటికోసం రాత్రిపూట ఎవరికీ తెలియకుండా రాజభవనం నుండి బయటకు వచ్చి వెదకసాగింది అవి దగ్గరలోనే వున్న శ్మశానంలో వున్నాయి. ఆ మొక్కలను పెరకటం మొదలుపెట్టింది ఇదంతా రాజభవనంలోని కొందరు ఆమెను వెంబడించి చూసారు ఆమె ఖచ్చితంగా ఒక మాయలమారి అని తేల్చుకున్నారు. రాజు దగ్గరకు వెళ్ళి తాము చూసింది చెప్పారు రాజు స్వయంగావచ్చి చూసాడు, ఎలిజా శ్మశానంలో మొక్కలను పెరుకుతున్న పని

రాజుకు ఎలిజా అంటే చాలా నమ్మకం ఆమె చేస్తున్న పనికి ఏదో కారణం వుండి వుంటుంది, ఆమె మాయలమారి కాదు, అనుకున్నాడు కానీ రాజభవనంలోని ప్రముఖులు పూరుకోలేదు ఆమెను వెంటనే చంపివేయాలని పట్టుబట్టారు.

రాజు ఇక ఏమీచేయలేక 'సరే, ప్రజలు ఎలా నిర్ణయిస్తే అలా చేస్తాను' అన్నాడు. ఆమెను చెరసాలలో వేసారు. ఎలిజా తన అల్లిక వస్తువులతో ఎవరితో నిమిత్తం లేకుండా పనిచేసుకుంటూ వుండిపోయింది

ప్రజలంతా ఆమెను సజీవదహనం చేయాలని తీర్పు యిచ్చారు. ఆమెను చెరసాలనుండి బయటకు తీసుకునివచ్చి ఒక బండిమీద ఎక్కించి పూరేగింపుగా తీసుకెళ్ళారు. ఎలిజా పదకొండవ చొక్కాను పూర్తిచేస్తూ ఆశగా హంసలకోసం ఎదురు చూడసాగింది. ఆమెను బండి దింపి దహనంచేసే చోటుకు తీసుకువచ్చారు ఆమెను స్తంభానికి కట్టేవేస్తున్న సమయంలో పదకొండు హంసలూ అతివేగంగా వచ్చాయి. అప్పటివరకూ ఎంతో నిరాశగావున్న ఎలిజా సంతోషంతో ఎగిరి తనవద్ద వున్న చొక్కాలను ఒక్కొక్కటీ హంసలమీద వేసింది వెంటనే అవన్నీ అందమైన రాజకుమారులుగా మారిపోయ్యాయి అక్కడున్న ప్రజలంతా ఆశ్చర్యపోయారు. విచారంలో వున్న రాజు కూడా విషయం తెలిసి పరుగు పరుగున వచ్చాడు

అన్నయ్యలందరూ అక్కడివారికి జరిగిన విషయం చెప్పారు

'ఇక నేను మాట్లాడతాను. బాగా మాట్లాడతాను ...' అంటూ మూర్ఛపోయింది ఎలిజా ఎన్నో రోజులు తమకోసం శ్రమించి అలా స్పృహ కోల్పోయిందని గ్రహించి, ఆమెకు సపర్యలు చేసారు కొంతసేపటికి ఆమె మేలుకుంది అందరూ సంతోషించారు ఆమె నిర్దోషి అని ప్రజలు నిర్ణయించారు రాజు ఎలిజాను పెళ్ళి చేసుకున్నాడు

అందరూ హాయిగా వున్నారు ✡

( హన్స్ క్రిష్టియన్ ఆండర్సన్ కథ ఆధారంగా )

— మాటలు, బొమ్మలు : బాబు

# ధర్మపథం

— బులుసు వెంకటరమణయ్య

ప్రాణులకు పరస్పరం విరోధం రెండు రకాలుగా దానవస్తుంది. సహజ విరోధం ఒకటి. కారణం వల్ల కలిగేదొకటి. జాతి వైరం సహజంగా దానవస్తుంది. అది సాధారణంగా జ్ఞాన విహీనమైన ప్రాణులనే సంబంధించి ఉంటుంది జ్ఞానం గల మానవులకు పరస్పరంవిరోధం ఉండదు. ఇతరులతో విరోధం పెట్టుకోవాలనే కోరిక ఎవ్వరికీ ఉండదు. పైవారి మైత్రి సంపాదించాలనే కోరికయే ఉండడం సహజం. విరోధం కలిగిందంటే దానికి ప్రబలమైన కారణం ఉంటుంది.

విరోధం కలగడానికి అయిదు కారణాలుంటాయని మహాభారతంలో చెప్పబడింది ఒకరి నేలను మరొకరు ఆక్రమించినందువల్లనూ, దాయాదుల మూలంగనూ, మాటమీద మాట వచ్చినా, ఆడువారి మూలంగానూ, నిష్కారణంగా తనకు అపకారం జరిగినా— విరోధం కలుగుతుంది. దాని అంతం చూస్తేనే గాని అది శాంతించదు

## పగ ఏర్పడే పద్ధతులు

ఒకరి భూమిని మరొకరు అన్యాయంగా ఆక్రమిస్తే పగ ఏర్పడి దారుణ హత్యలు జరుగుతూ ఉండడం నిత్యం చూస్తూనే ఉన్నాం. దాయాదులకు ఆస్తి విషయంలో విరోధం కలగడం వింతకాదు. మనకు కౌరవ పాండవులే ఉదాహరణ. చినికి చినికి గాలివాన అన్నట్లుగా, మొదట చిన్న వాదం ప్రారంభమై — మాటమీద మాట వచ్చి విరోధం కలగడం చూస్తూనే ఉన్నాము.

ఆడవారి మూలంగా విరోధం కలగడానికి రామాయణ భారతాలే ప్రబల నిదర్శనాలు.

నిష్కారణంగా అపకారం కలిగిస్తే విరోధం కలగక తప్పదు. ప్రత్యపకారం చేసే వరకూ ఆ పగతీరదు. తర్వాతనే మనస్సుకు శాంతి కలుగుతుంది. ఇది పశు, పక్షులలో కూడా కానవస్తుంది. దీనికి భారతంలో చక్కని ఉదాహరణ ఉన్నది

పూజని అనేపక్షి ఒక రాజుగారి ఇంట్లో ఉండేది. అది దాని పిల్లకు ఆహారంగా పళ్ళు తెచ్చేటప్పుడు —ఆ పిల్లతో వినోదంగా ఆడుకుంటున్న రాజుగారి పిల్ల వానికి కూడా అభిమానంతో ఇచ్చేది ఒకప్పుడు ఆ పిల్లవాడు ఆ పక్షిపిల్ల పీక పిసికి చంపివేశాడు. తల్లిపక్షి వచ్చి చూచి తీరని కోపంతో ఆ పిల్లవాని కన్నులు పొడిచివేసి అంధుణ్ణి చేసింది తర్వాత, అది రాజుతో జరిగినది చెప్పి— ఇక తానక్కడ ఉండనని. వెళ్ళిపోతున్నానని తెలియజేసింది.

రాజు 'నీ తప్పు లేదు. చేసిన తప్పునకు నా కుమారునికి తగిన శాస్తి జరిగింది. నేనేమీ అనుకోను. నీవు ఇక్కడనే ఉండవచ్చు' అనిచెప్పినా అదివినలేదు నీకు "నేను అపకారం చేసినందున— నాపై పగ సాధించాలనే కోరిక నీకు ఉండక తప్పదు. నేనిక్కడ ఉండడం, పాము ఉన్న ఇంట్లో ఉన్నట్లే. ఉంటుంది. అది నాకు క్షేమము కాదు" అని చెప్పి వెళ్ళిపోయింది

పగ వేటి మూలంగా ఏర్పడుతుందో ఇలా తెలుసుకుని వాటి వల్ల అది కలగకుండా జాగ్రత్త పడడం మంచిది

---

ఇప్పుడు సందర్భానుసారంగా జ్ఞాపకం వచ్చిందిగాని అతని కౌగిలిలో కిమిడి పోయిన నేను కొత్త చీరని ప్రశంసించలేదని మరిచే పోయాను. ఇంత చిన్న విషయానికి బాధ పడటానికి ప్రవీణ్ స్వభావం తెలియదా... ఏడాదా, రెండేళ్ళా... సరిగ్గా పన్నెండేళ్ళు..

పెళ్ళయిన కొత్తల్లో అందరిలాగే నా కట్టూ బొట్టూ నా భర్త మెచ్చుకోవాలని, వేరువేరు అలంకరణలతో అతన్ని చేరే నాలో కొత్త అందాలని వెతుకుతుంటే పరవశించి పోవాలని, ప్రతిరోజూ కొత్తరోజులాగ గడపాలని ఇంకా ఎన్నో ఆశించిన నాకు నిరాశే ఎదురైంది. బెడ్‌రూములోనే నాకోసం టైము కేటాయించే ప్రవీణ్ నా కలలు నిజం చేస్తాడనుకోవడం వృథా అని తెలుసుకోడానికెక్కువ రోజులు పట్టలేదు. దానితో పాటు నన్ను ప్రాణంతో సమానంగా ప్రేమించే ప్రవీణ్‌ని ప్రేమించకుండా ఉండలేనని, చిన్న చిన్న పొగడ్తలతో మురిపించలేదని అలిగి, కోపగించుకొని, నేను బాధపడి అతని బాధపెట్టి, యిద్దరి జీవితాలు నరకం చెయ్యకూడదని నిశ్చయించుకోడానికి

## నాకు 'తృప్తి' అని చక్కటి పేరుంది

(18వ పేజీ తరువాయి)

కూడ ఎక్కువ రోజులు పట్టలేదు. మనస్సుతో చేసుకొన్న ఒప్పందంతో జీవితం సాఫీగా...

నా వైవాహిక జీవితం సాఫీగా ఉందనే కన్నా యాంత్రికంగా ఉందంటే బాగుంటుందేమో. ప్రవీణ్ పరిగెట్టే ప్రపంచానికి ప్రతినిధి. డబ్బుతో విలువకట్టే మనుషులు, స్వలాభాల కోసం చేసే స్నేహాలు, పెదవులతో పలకరించే ప్రేమలు వృత్తిరీత్యా యిటువంటి సమాజంలో చిక్కుకున్న అతని సహధర్మచారిణిగా అతని స్టేటసుని మెయిన్‌టెయిన్ చెయ్యాలి. డబ్బుతో మిసెస్ ప్రవీణ్ పాత్రకి న్యాయం కూర్చడం కష్టం కాదు కాని ఒక స్త్రీగా, భార్యగా... నా ఉదాసీనతకి కారణమడిగిన విజయ్‌కి సమాధానమేమిస్తాను ? ఈ శాలువ కొన్నరోజు...

ఉదయం నుండి పడుతున్న చినుకులు తెరిపిస్తే, పిల్లల్ని రెస్ట్ హవుసులోనే వదిలి నేను, విజయ్ షాపింగుకి బయలుదేరేము. అవీ యివీ కొంటూ బట్టల షాపులో కెళ్ళేము.

"నీకు బాగుంటుంది తృప్తీ," అంటూ ఒకచీర తీసాడు.

"మూడువందల రూపాయల చీర నాకెందుకు ?" చేతిలోకి తీసికొన్న చీర ధర చూసి పెట్టేసాను

"మిసెస్ ప్రవీణ్ అనవలసిన మాటలు కావవి" అన్నాడు బయటకు నడుస్తూ. కొంతదూరం వెళ్ళాక అతనే అన్నాడు, "నేనొక విషయం అడుగుతాను, మరేమీ అనుకోకపోతే."

నేను ప్రశ్నార్థకంగా చూసాను.

"నువ్వు నీపట్ల అశ్రద్ధ ఎందుకు చూపిస్తావు ?"

"అంటే ?"

"అందరికీ కొన్నదానివి నీ చీరంటే వెనక్కెందుకు తీసావు ?"

"ఓ అదా! కాశ్మీరు శాలువ కొనుక్కుందామని"

"ఇదే కాదు. వచ్చినప్పటి నుండి

చూస్తున్నాను. ఆడవాళ్ళు సాధారణంగా చూపెట్టే ఆసక్తి వేష భాషల అందు చూపెట్టవెందుకని?"

"పెద వయసొచ్చాక, డిగ్నిఫయిడ్‌గా.."

"పెద్ద వయస్సా? ఎవరికి? నీ వయస్సు వాళ్ళు మా ఊర్లో... అంతెందుకు 'మా వాళ్ళు...'" ఏదో జ్ఞాపకం రావడంతో ఆగి తిరిగి అన్నాడు. "ఆ తళుకు బెళుకుల బట్టలు, అరంగుళం దళసరి మేకప్, పెదవులకి ఎర్రటి పెయింట్... దానికంటే తక్కువ అలంకరణలో నువ్వే అందంగా ఉన్నావేమో."

అతను 'మా వాళ్ళు' అని తన భార్యనంటాడని, ఆమె గురించి చెప్పిన తరువాత కొంతసేపు మాటాడాలని కిష పడడని తెలిసిన నేను మౌనంగా అతని వెనకాతల కాశ్మీరు ఎంపోరియమ్‌కి కెళ్ళేను. శాలువ తీసికొంటావన్నాను కనుక అతను ఎంచినది ఖరీదెక్కువైనా కొనవలసొచ్చింది.

"ఇంత ఎక్సలెంటుగా సెలక్టు చేసే భర్తని పొందిన స్త్రీ..." అతని భార్యపట్ల సబ్‌కాన్షస్‌లో పేరుకుంటున్న జెలసీ నా మాటల్లో ధ్వనించగానే అతని మొహం మలినమైంది.

"నా సెలక్షనెవరిక్కావాలి? రాళ్ళతో స్నేహంచేసి, టి. పి. నాటి కటకాల మధ్య తిరిగే నాకు ఈ శతాబ్దపు ఫేషన్సు తెలియవని..."

ఎంత తేడా... అతని ఎంపిక ఎవ్వరికీ అక్కరలేదు... తనచేత్తో నచ్చని వస్తువైనా తెస్తే మురిసిపోయే నాకు ప్రవీణ్ విప్పాడో తప్ప.. అతనికి నచ్చని విధంగా అలంకరించుకొనే అతని భార్య...వివరికోసం అలంకరించుకోవాలనే నేను... పతే సర్వస్వమనుకొనే పతివ్రత ననికాదు గాని మన కిష్టమైన వాళ్ళు మెచ్చుకుంటేనే అలంకరణ కందమొస్తుందనిపిస్తుంది. 'తక్కువ అలంకరణలో నువ్వే అందంగా...' 'వీరకి, శాలువకి ఆశ్రయమిచ్చిన నువ్వు ఎక్కువ అందంగా...' నేను నిజంగా అందంగా ఉన్నానో లేక విజయ్ కంటికే... అతనికి ప్రత్యేకంగా కనిపించడానికి నే నేమవుతాను? ప్రశంసలకి మురిసిపోతున్నాను గాని... మళ్ళీ నవ్వొచ్చింది

"నీలో నువ్వు నవ్వుకుంటున్నావు... ఏమిటో చెప్తే నేను ఆనందిస్తాను, అఫ్ కోర్స్ పర్సనల్ కాకపోతే," విజయ్ మాటలకి వాస్తవంలో కొచ్చాను.

"పర్సనలే," పరధ్యానానికి సిగ్గుపడుతూ అన్నాను.

"ఇక్కడ కొంచెం సేపు కూర్చుందామా?" పొడిగా అన్నాడు.

లేక్ దగ్గిరున్న పార్కు నిర్మానుష్యంగా ఉంది సుమారుగా. దూరంగా రెస్టారెంట్ దీపాలు కనిపిస్తున్నాయి. వీటిమీద నుండి వస్తున్న చల్లటిగాలి, సిందూరపోసినట్టు వెన్నెల, చంద్రుడి ధాటికి వెలవెలబోయిన నక్షత్రాలు, ఏటనాలుగా పడుకొని వాటిని లెక్కపెడుతున్న విజయ్ పెదవుల మధ్య సిగరెట్టు. ఇదే ప్రవీణ్‌తో ఏకాంతంలో, ప్రకృతి ఒడిలో...కాని ఎయిర్ కండిషన్డ్ గదిలో, డన్‌లప్ పరుపు మీద పడుకొని, ఏ పుస్తకమో చదువుకుంటూ ఎదురు చూస్తే ఎప్పటికో లైటార్పి నా దగ్గరకొచ్చే ప్రవీణ్‌కి కవులు వర్ణించే రసికత్వానికి ఎంత దూరం .. విజయ్ నా భర్తే ఉంటే ... ఛీ యిదేమిటి...పవిత్రమైన భారతదేశంలో పుట్టి పర పురుషుడిని గురించి...మనస్సుకి కళ్ళెం వెయ్యడానికి ప్రయత్నం మొదటిసారి కాదు. జాగ్రదావస్థలో ఎంతో అదలించగలను కాని సబ్‌కాన్షస్ మైండ్ చేసే అల్లరి నెలాగ కట్టగలను? శారీరిక, మానసిక పవిత్రతను బోధించే హైందవ సంస్కృతిని జీర్ణించుకొన్న నేను భారత నారికి మాత్రం కోరికలుండవా? ప్రకృతి సహజమైన ఆకర్షణకి లోబడదా? "తృప్తీ" ఉలిక్కిపడి విజయ్ వైపు చూశాను

తలకింద చేతులు పెట్టుకొని ఆకాశాన్ని చూస్తూనే అన్నాడు, "తృప్తీ, రేపు నువ్వు ...మీరు వెళ్ళిపోతారంటే అనుకోకుండా కలిసిన మనం యింత త్వరగా విడిపోతున్నామంటే బాధగా ఉంది. నాది విచిత్రమైన స్వభావమని, నా విచిత్రమైన అభిరుచులని, నాతో ఏకీభవించి, నన్ను మెచ్చుకొనేవారు, ముఖ్యంగా ఆడవాళ్ళలో ఉండరని నేను యిన్నాళ్ళు నమ్మేను. ఇప్పుడు నీ పరిచయంతో నా భయాలని మార్చుకోవాలని వస్తున్నాది. ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగిన నీకు, నాకు సామ్యమేముంది? ఉత్తర, దక్షిణాలకి చెందిన మన అభిరుచులు కలవడం, మనుష్యుల్లో ఏ రకమైన భేదము లేదని మనస్సుని ఈ స్నేహము మానవ జాతిని బంధించి ఒకటి చేసిందనిపిస్తుంది. తృప్తి ఏది పదిహేనేళ్ళ క్రితం మనం కలిసుంటే..."

"మనం ఒకరి సౌభాగ్యం గుర్తించక పోదుమేమో. ఆ వస్తువల్లో మన కెవరు వచ్చుతారో తెలుసుకొనే పరిపూర్ణత లెక్కడిది?"

"అంటే యిప్పుడు మనం గుర్తించుకున్నట్టే కదా?"

అతను నావైపు తిరిగి అడిగే సరికి నెర్వస్ అయిపోయాను. నా ఊహలో పసలకి అతను రూపం కల్పించే సరికి, నాకు తెలియ



# సామెతల కథలు

## కరటక దమనకులు

ఎడబాయకుండా ఉన్న వంచకులనూ, మోసగాళ్ళనూ ఈ పేరుతో పిలుస్తుంటారు.

కరటకుడు, దమనకుడు, యివి రెండు జంబుకాల పేర్లు. వీరు విడిపోని స్నేహితులు. యుక్తులూ కుయుక్తులలో ప్రసిద్ధులు. ఇద్దరు మనస్సులను కలపనూ గలరూ, విడదీయనూ గలరు. కుతంత్రాలతో పేరుపొందారు. చిన్నయసూరి రచించిన పంచతంత్రములోని మిత్రభేదం కథ అంతా, వీరు చేసిన పనులూ, పన్నాగాలూ, తంత్రాలూ, కుతంత్రాలూను.

వీరు మృగరాజు కొలువులో మంత్రులుగా ఉన్నారు. మృగరాజు, వీళ్ళు ఎంతచెబితే అంత. ఆ వనంలోకి కొత్తగా ఒక వృషభం వచ్చింది. ఆ వృషభం రంకెకు హడలిపోయాడు మృగరాజు. కరటక దమనకులు మృగరాజుకు ధైర్యం చెప్పి, దానికీ, వృషభానికీ మధ్య రాయబారాలు నడిపి, వారిని స్నేహితులుగా చేశాయి. ఆ వృషభమూ, మృగరాజూ చాలా దగ్గర స్నేహితులయ్యారు. మృగరాజు వృషభాన్ని సంప్రదించకుండా ఏ పనీ చేసేవాడుగాదు. వాళ్ళిద్దరూ, కరిని విడిచి మరొకరు ఉండలేనంత సన్నిహితులయ్యారు.

మృగరాజు కొలువులో, రోజు రోజుకూ వృషభం ప్రాముఖ్యత పెరిగిపోతూంది. కరటక దమనకుల ప్రాబల్యం తగ్గుతూంది. కరటక దమనకులు దానిని సహించలేకపోయారు. ఎలాగైనా, వారిద్దరి మధ్య విరోధాన్ని ఘటించాలనుకున్నారు. సింహం వద్దకు వెళ్ళి లేనిపోని చాడీలు కల్పించి ఎద్దుపై చెప్పారు. ఎద్దువద్దకెళ్ళి, సింహం దానిని చంపడానికి, అవకాశం కోసం ఎదురు చూస్తూందని చెప్పారు. అలా వాళ్ళిద్దరిమధ్య వైషమ్యాన్ని కల్పించారు. సింహం, ఎద్దూ, ప్రాణ స్నేహితులల్లా బద్ధవిరోధులయ్యారు. చివరకు కరటక దమనకులు సింహంతో ఎద్దుని చంపించి, పోయిన తమ ప్రాబల్యాన్ని తిరిగి సంపాదించారు. దాన్నిబట్టి తెల్సుకోవచ్చు. వాళ్ళేదైనా చేయగల సమర్థులని. ఆ కథపై వచ్చిన సామెతతో అలాంటి మోసకారులను పిలుస్తుంటాం.

ఆ నాడు చిన్నయసూరి, నక్కలపై ఆ కథ రాశారు కాని ఈనాడు ఆ నక్కలను మించిన నరులు కోకొల్లలు.

— విద్యావతి గంగాధర్

కుండానే మనస్సు విప్పి చెప్పేనని గ్రహించేసరికి మాట పెగలలేదు. మౌనం కూడా మనస్సులోని భావాలని వ్యక్తం చేస్తుందన్నాడొక ప్రసిద్ధ రచయిత. కొంతసేపు తరువాత గుండెదడ సర్దుకున్నాక టాపిక్ మార్చడానికి ప్రయత్నించాను, కాని విజయ్ వదిలి పెట్టలేదు.

అతను లేచి వచ్చి నా భుజాల మీద చేతులు వేసి కళ్ళలోకి చూస్తూ, అన్నాడు, "మాట తప్పించ నక్కరలేదు, తృప్తీ...నీ మనస్సులోని అలజడిని నేను గ్రహించలేదనుకున్నావా? మాటల్లోను, చేతల్లోను మనస్సుని ప్రతిబింబించకుండా జాగ్రత్తపడ్డావుగాని, ఒక విషయం మరచిపోయావు. ఏదైనా దాచడాని కతి ప్రయత్నం చేస్తే అదెక్కువ స్పష్టంగా ప్రస్ఫుటమవుతుంది. తిట్టొచ్చి గతంలో మనం కలియలేదు కాబట్టి ఏమి జరిగుండేదనే ప్రసక్తే లేదు. ఆ మాటకొస్తే మనలాంటి వాళ్ళు కలిస్తే ఊహాలోకాల్లో విహరిస్తూ వాస్తవాన్ని మరచి పోతామని కాబోలు ఈ దూరాల్ని సృష్టిస్తాడు దేవుడు..."

## నాకు 'తృప్తి' అని చక్కటి పేరుంది

అతని చొరవకి తెలబోయిన నేను, అతని చర్యకి వచ్చిన కోపాన్నణచుకొంటూ, నేర్పుగా అతని చేతుల నుండి విడిపించుకున్నాను అయితే అతని స్పర్శకి పంచ్చు తప్పిన మనస్సుని అదుపులో పెట్టి లేచేసరికి చెమట పట్టింది. అతను నీటో చూస్తూ సిగరెట్టు ముట్టించాడు.

"ఇంక వెళ్దామా?" సాధ్యమైనంత సహజంగా అన్నాను.

అతను మౌనంగా అడుగులు వేశాడు. నేను కూడా మాట్లాడకుండా అతననుసరించాను. చుట్టూ ఆవరించిన నిశ్శబ్దత వికృతంగా మారి నన్ను కలవర పరుస్తున్నా నిశ్చలంగా ఉన్న నీటిని చూస్తూ మనస్సుని కట్టడానికి ప్రయత్నిస్తున్నాను. రెస్ట్ హౌసు దగ్గరైంది గాని అల్లకల్లోలమైన మనస్సు మాత్రం...

"నన్ను క్షమించు, తృప్తీ..." విజయ్ హీనంగా అన్నాడు.

"క్షమించడాని కేముంది? జీవితాన్ని ఒకే దృక్పథంతో చూసే మన దారులు మాత్రం వేరు కాకతాళీయంగా కలిసిన మన మీ విధంగా క్షణికోద్రేకానికి..." గొంతుక జీరపోగా నా నిగ్రహం సడలిపోయింది

"నాకూ తెలుసును, తృప్తీ... రేపటి తరువాత నువ్వెక్కడో నేనెక్కడో... నా మాటలకి విలువలేదనా యింటూ..."

నా మాటలు వినీ వినిపించకుండా వచ్చినా కళ్ళు మసకబారి, కాళ్ళు తడబడి, తూలి పోతుంటే విజయ్ పట్టుకున్నాడు.

"కాకతాళీయంగా ఏర్పడినా ఈ భావ బంధం క్షణికోద్రేకం కాదు, తృప్తీ... దారులు వేరైనా మనస్సులకి దూరాలు తెలియవు... నన్ను మరచి పోవుకదూ..." అతని పెదవులు అస్పష్టంగా గొణిగాయి.

రెండు నిమిషాలు అచేతనంగా ఉన్న నేను అతని బాహుబంధం తప్పించుకొన్నాను. కాని కళ్ళల్లో నిలచిన నీళ్ళు అతనికి సమాధాన మిచ్చాయి.

# 3 నెలలు వచ్చిన తర్వాత, పాలు మాత్రం యిస్తే చాలదు



## డాక్టర్లు సిఫార్సు చేస్తారు



# ఫారెక్స్®

### మీ పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

**డాక్టర్లు ఫారెక్స్ సిఫార్సు చేస్తారు! ఎందువల్ల?**

ఎందుకంటే, ఇది మీ పాపాయి ఘన ఆహారం తీసుకోవడం ప్రారంభించే సమయంలో అతడి అవసరాలను తీర్చే సంపూర్ణ సంతులిత ఆహారం. పాపాయి సున్నితమైన జీర్ణకోశానికి సరిగ్గా తగిన ఆహారం.

**ఫారెక్స్ ఏ విధంగా పాపాయికి తగిన సంతులిత ఆహారం?**

ఫారెక్స్ మెదడు, శరీరం పెరుగుదల కోసం తగినన్ని సులభంగా జీర్ణమయ్యే ప్రొటీన్లను, శక్తి కోసం కార్బోహైడ్రేట్లను, దృఢమైన ఎముకలు, గట్టి పళ్ళు పెరిగేందుకు తగినంతగా కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ డి అందిస్తుంది. అన్నిటి కంటె ముఖ్యంగా, పాపాయి రక్తాన్ని ఆరోగ్యంగా ఉంచేందుకు తగినంత ఐరన్ అందజేస్తుంది.

**3 నెలలు వచ్చాకనే ఎందుకు?**

ఈ వయస్సులో పాపాయికి నమలడం అలవాటు కావాలి. లేకపోతే నమలకుండా మింగివెయ్యడం వల్ల కడుపు నొప్పి వచ్చి అతడి పెరుగుదల దెబ్బ తినవచ్చు.

అంతే కాకుండా, 3 నెలలప్పుడు పాపాయి జీర్ణకోశం ఇంకా సున్నితంగానే ఉంటుంది. అందుకే మామూలు ఘన ఆహారాలకు బదులు అతడికి ప్రత్యేకంగా తయారు చేయబడిన—అంటే సులభంగా జీర్ణమయ్యే—పిల్లల ఘన ఆహారం అవసరం.

**"పెద్దలు తినే' ఆహారాన్ని ఎప్పటినుంచి ఇవ్వవచ్చు?**

పాపాయి మొదటి సారిగా తప్పటడుగులు వేసినప్పుడు అతడు పెద్దలు తినే ఆహారాన్ని తీసుకోగలుగుతాడు. కొంచెం ఆలోచించి. మీ పాపాయి తినేవాటన్నిటిలో ఫారెక్స్ కలిపి ప్రేమగా పెట్టండి.

ఇప్పుడు అదే శ్రేష్ఠమైన ఫారెక్స్ కొత్త 400 గ్రాముల డబ్బాలో వస్తోంది.




## సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

లింటాస్-GLF. 64-2315 TL.

# నల్లకోటు



గుడిసేవ సుందరరామయ్య

ఆ రోజు కోనేటి సెంటర్లో గొప్ప బహిరంగ సభ ఏర్పాటు చేయబడింది. రంగు రంగుల షామియానా క్రింద ఎత్తయిన వేదికను ఏర్పాటు చేశారు. పట్టణంలోవున్న వివిధ ప్రభుత్వ సంస్థలకు చెందిన ట్రేడ్ యూనియన్ లీడర్స్ కుర్చీల్లో ఆసీనులై వున్నారు. కార్యక్రమం ప్రారంభమైన తర్వాత ఒకరి తర్వాత ఒకరు మైక్ ముందుకు వచ్చి తమ తమ ఉపన్యాసాలను గంభీరమైన కంఠంలో ఉద్రేకపూరిత స్వరంతో చెప్ప సాగారు. ప్రభుత్వం తమలాంటి ఉద్యోగుల పట్ల నిర్లక్ష్య వైఖరిని అవలంబిస్తుందన్నారు. ఆకాశాన్ని అంటుకొనే ధరలను అదుపులో పెట్టలేక పోతుందన్నారు. తమ న్యాయమైన కోర్కెలను పరిశీలించలేక పోతుందన్నారు. ఉద్యోగుల్లో నిరాశా నిస్పృహలను అధికం చేస్తుందన్నారు. తామందరూ సమిష్టిగా పనిచేస్తే తప్ప తమ తమ కోర్కెలను హక్కులను సాధించటానికి వీలుపడదన్నారు.

వాడిగాను, వేడిగాను వున్న వక్తల వాక్కులను వినేసరికి హరిముకుందంలో ఉద్రేకం, ఉద్వేగం అధికమయ్యాయి. కోపంతో చేతివ్రేళ్ళు బిగుసుకొన్నాయి. ఆ సమయంలో ఆ వ్రేళ్ళ మధ్య ఏ ఆఫీసర్ మెడకాయో వుంటే తప్పకుండా హరిముకుందం హంతకుడయ్యేవాడు. కాని అదృష్టవశాత్తు అతని వేళ్ళ మధ్య సైకిల్ హ్యాండిల్ బార్ వుండటం చేత ప్రమాదం తప్పింది. అతనికి ఆవేశం వచ్చినా, ఆగ్రహం వచ్చినా అంతే! తనంతట తాను ఏ నిర్ణయానికి రాలేని బలహీనుడు. అవతలివాడు ఇన్స్పైర్ చేయాలే కాని, ఎవరినైనా హత్య చేయటానికి గూడా వెనుకాడడు. తన స్వంత శక్తి మీద కన్నా ఎదుటి వాడిచ్చిన సలహాపైనే అతనికి గురి ఎక్కువ.

కార్మిక నాయకులు తమకు జరుగుతున్న అన్యాయాల గురించి గొంతు చించుకొని చెప్తుంటే హరిముకుందం ముఖం కోపంతో ఎర్రగా కందిపోయింది. అతని మనసులో ద్వేషం రగుల్కొంది. ప్రతీకార వాంఛ ప్రజ్వరిల్లింది.

'నిజమే! ప్రభుత్వం తనలాంటి వుద్యోగులకు ఎంతో అన్యాయం చేస్తోంది. ఎంతో కష్టపడి చదువుకొని తాము విజ్ఞాన సర్వస్వాన్ని ధారపోస్తుంటే బిచ్చం విదిలిస్తుంది ప్రభుత్వం. తమలాంటి వాళ్ళ కష్టార్జితం ఫలితంగా ప్రభుత్వానికి కోట్లకు కోట్లు లాభాలు వస్తుంటే తమకు బోనస్ ఇవ్వటానికి నిరాకరిస్తోంది ప్రభుత్వం! పైగా బోనస్ చెల్లించాలని సమ్మె చేస్తే ఓ రోజు జీతం కట్ చేయటమే కాకుండా పనిష్మెంటుగా నెల రోజులపాటు ఇంక్రిమెంట్లను వాయిదా వేయించింది. తెలివిగలవాళ్ళు సెలవులు పెట్టి సమ్మె చేయకుండా తప్పించుకొన్నా తనలాంటి అమాయకులు అనవసరంగా బలైపోతున్నారు. ఏది ఏమైనా తన విషయంలో అన్నీ ఎదురు తిరుగుతున్నాయి. ప్రభుత్వాన్నే అనుకొని ఏం లాభం? కట్టుకొన్న పెళ్ళామే తనను నిర్లక్ష్యం చేస్తోంది!'

పెళ్ళాం సంగతి గుర్తుకు రాగానే హరిముకుందం పరిసరాలను మర్చిపోయాడు. ఓ బొమ్మలా నిలబడ్డాడన్న మాటే కాని అతని మనస్సంతా పెళ్ళాం గురించి ఆలోచనలతో నిండిపోయింది.

'తన భార్య పుట్టింటికివెళ్ళి దాదాపు సంవత్సరమైంది. ఈ సంవత్సరంనుంచి ఎన్ని బాధలు ఎదుర్కొన్నా తన మీద సానుభూతి చూపించేవాడు ఒక్కడూ కన్న

డటంలేదు. ఉండటానికి తనకూ ఇద్దరు అక్కలున్నారు. కాని తన కుటుంబ విషయాలలో జోక్యం చేసుకోమని ఏనాడో ఖచ్చితంగా చెప్పేరు వాళ్ళు. వాళ్ళలా చెప్పటానికి కారణం తన మామమీద వాళ్ళకున్న ద్వేషమే! అసలు తన పెళ్ళి గమ్మత్తుగా జరిగిపోయింది. చదువు పూర్తి చేసుకొని ఉద్యోగం కోసం ప్రయత్నం చేస్తున్న సమయమది! తన కూతుర్ని చేసుకొంటే ఉద్యోగమిప్పిస్తానని తన తల్లి దగ్గరకు వచ్చాడు ఓ వేలు విడిచిన మేనమామ! పిచ్చి తల్లి వాడి మాటలను నమ్మేసింది. తనను కూడా పెళ్ళికి ఒప్పించింది. చిన్నప్పుడే తండ్రిని పోగొట్టుకున్న తను తల్లి నీడలో పెరగటం చేత ఆమె మాటను కాదనలేకపోయాడు అప్పటికే పెళ్ళిళ్ళై వేరుకాపురాలు పెట్టిన అక్కలిద్దరికి యీ సంబంధం యిష్టం లేదు. అయినా అమ్మ మాట ప్రకారం రాధతో తన పెళ్ళయిపోయింది. మామ మాత్రం ఉద్యోగం యిప్పించలేకపోయాడు. ఉద్యోగంకోసం పదివేలు లంచం పెట్టాలని నమ్మించి తనకున్న మాగాణిని కాస్త అమ్మించి డబ్బును చేజిక్కించుకున్నాడు. మామ దుర్మార్గుడని అక్కలు హెచ్చరిస్తున్నా తను లక్ష్యపెట్టక ఉద్యోగం వస్తుందనే ఆశతో ఆస్తిని అమ్ముకొని మామకు సమర్పించాడు. ఆస్తి పోగొట్టుకొని తను తల్లితోసహా అత్తవారింటో తలదాచుకోవాల్సివచ్చింది. ఆ మనుషుల మధ్య తనతల్లి అడ్జస్ట్ కాలేకపోయింది. పెద్దక్కయ్య దగ్గరకు వెళ్ళిపోయింది. తను మాత్రం సంవత్సరంపాటు అత్తవారింట్లో వుండి, ఉద్యోగంలేని మొగుడు భార్యకూడా అలుసే అన్న నగ్నసత్యాన్ని తెల్సుకొన్నాడు.

బయటకు పోయేందుకు దారిలేక అక్కడ ఉండటం ఇష్టంలేక తను ఎంతో వ్యధచెందుతున్న సమయంలో తనకీబ్యాంక్ ఉద్యోగం వచ్చింది. ఈ ఉద్యోగం రావటానికి కారణం తన మామకాదు. తన పెద్దక్కయ్య చేయించిన సిఫార్సు! ఉద్యోగంలో జాయినయ్యాక తను బయటకు వచ్చేసి తల్లినికూడా తన దగ్గరకు తెచ్చుకున్నాడు. అసలు కష్టాలు ఆరంభమయ్యాయి. తల్లికి చాకిరీ చేయనని మారాం చేసిన తన భార్య ఓ ప్రక్క, లంచమిచ్చానని తన దగ్గర తీసుకొన్న డబ్బును ఎగ్గొట్టానికి చూసేమామ మరోప్రక్క తనకు మనశ్శాంతి లేకుండా చేశారు. ఆ సమయంలోనే అమ్మ చనిపోవటంతో తన బాధలు మరింత ఎక్కువయ్యాయి. తనభార్య తనకంటికి ఓ మోసగాని కూతురిలా కన్పించింది. రాధకూడా చీటికి మాటికి పోట్లాట పెట్టుకోటం, అదిలేదని ఇదిలేదని దెప్పిపొడవటం నేర్చుకొంది. భార్యను సంతోషపెట్టలేని వాడివి పెళ్ళెందుకు చేసుకొన్నావని అడిగే స్థితికి కూడా వచ్చేసింది. తను చేయి చేసుకోవాల్సిన పరిస్థితిని కల్పించింది. తన బాధ పడలేక తండ్రికి కబురు చేసింది. అతగాడొచ్చి నానా మాటలన్నాడు. తనేం తక్కువ తినలేదు! మాటకి మాట ఎదురు చెప్పాడు. 'నువ్వు పంపమని కబురు చేసేదాకా నా కూతుర్ని పంపనని' శపథం చేసి తన మామ రాధను తీసుకుపోయాడు. కాలం గడుస్తున్నా తనలోను మార్పు రాలేదు! వాళ్ళలోన మార్పు రాలేదు! ఎవరైనా అడిగితే పెళ్ళాం పుట్టింటికి వెళ్ళిందని చెప్తున్నాడు తను! ఇలా ఎంతకాలం? ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి? తను రోజూ ఆలోచిస్తూనే వున్నాడు ఈ విషయం! అయితే నాల్రోజుల క్రితం తన యింటి కెదురుగా వున్నడాక్టర్ గారింటికి వచ్చిన వ్యక్తిని చూడగానే తనకో వుపాయం తట్టింది. నల్లకోటును, లావుపాటి కళ్ళద్దాలను ధరించిన ఆ వ్యక్తిని చూడగానే కోర్టులు గుర్తుకు వచ్చాయి. ఆయన తప్పకుండా లాయర్ అయి వుంటాడు విడాకుల గురించి వివరాలు తెల్సుకోవాలనే కోరిక ఆయన్ని చూడగానే కల్గింది. రాధకు విడాకులిచ్చేసి మరో అమ్మాయిని చేసుకొంటే తన జీవితం బాగుపడుతుంది ఈ కాలంలో తనలాంటి బ్యాంకు వుద్యోగికి పిల్ల దొరకటం కష్టం కాదు! పైగా కట్నం కూడా రాబట్టుకోవచ్చు...'

"ఏం గురూ! ఇంకా అలానే నిలబడి పోయావేం? మీటింగ్ అయిపోయింది" అని ప్రక్కనున్న మిత్రుడు భుజం తట్టేసరికి హరిముకుందం ఉలిక్కిపడ్డాడు.

జనం ఎవరి దారిని వారు వెళ్ళి పోతున్నారు.

హరిముకుందం సైకిల్ను వెనక్కి త్రిప్పి కొంచెం దూరం నడిపించి ఎక్కబోయాడు కాని అంతలోనే అతనికి ఎదురుగా నల్లకోటు ధరించిన వ్యక్తి సైకిల్ను నడిపించుకు రావటం కన్పించగానే ఠక్కున ఆగిపోయాడు.

"నమస్కారం సార్!" అన్నాడు అప్రయత్నంగా.

"ఎవరండీ?" అంటూ ఎగాదిగా చూశాడు నల్లకోటు వ్యక్తి.

"ఓ.. సారీ! బహుశా నన్ను మీరు యింతకు ముందు చూసి వుండరు మా యిల్లు డాక్టర్ జ్యోతి ప్రసాద్ గారింటి దగ్గరే! గత నాల్రోజులుగా మీ రక్కడకు వస్తున్నారు గదూ?"

"అవును! మీరేం చేస్తున్నారు?"

హరిముకుందం తను పనిచేసే బ్యాంకు పేరు చెప్తూ తన చొక్కాకు వ్రేలాడుతున్న నల్లటి రిబ్బను ముక్కతో పిన్ చేసిన బ్యాడ్జిను చూసుకొన్నాడు. ప్రభుత్వానికి తమ నిరసనను తెలియజేస్తూ ధరించిన ఆ బ్యాడ్జిమీద వుద్యోగుల డిమాండ్స్ ఎర్రటి అక్షరాలలో కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నాయి

నల్లకోటు వ్యక్తి తదేకంగా బ్యాడ్జివైపు చూస్తూండిపోయాడు

"సారీసర్! మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తున్నాను! మిమ్మల్ని చూసినప్పట్నుంచీ మీతో మాట్లాడాలనుకొంటున్నాను కాని మా స్ట్రయిక్ హడావుడిలో నాకు తీరిక చిక్కలేదు మీరిప్పుడు ఏ యింటికెళ్తున్నారా?"

"లేదండి! డాక్టర్గారింటికి బయల్దేరాను కాని దార్లో మీ కార్మిక నాయకుల



## గుర్తింపు

నిశిది లేనిదే
వెలుతురుకు విలువలేదు
వెన్నెల లేనిదే
చంద్రుడికి రాణింపు లేదు
మగడు లేనిదే
మగువకు నీడ లేదు
నిషా రానిదే
సారాలో హుషారు లేదు
సన్నాయి మేళం లేనిదే
సరదాగా పెండ్లి కాదు.
ఖద్దరు లేనిదే
నాయకునికి గుర్తింపు లేదు. !

— పోతుకూచి సాంబశివరావు



# నల్లకోటు

వుపన్యాసాలు విన్నప్పుడు అంతే! ఇంటూ ఇలా నిలబడిపోయాను !''

"అయితే ఇంకేం! నగాట్లాడుకుంటూ వెళ్ళాంరండి!'' అంటూ హరిముకుందం సైకిల్‌ను నడిపించసాగాడు. అతని ప్రక్కనే నల్లకోటు వ్యక్తి కూడా మెల్లగా సైకిల్‌ను నడిపించసాగాడు.

"ఇంతకూ తమరి పేరును నేను చెల్ప కోలేదు !'' అడిగాడు హరిముకుందం.

"పరంధామయ్య !'' నవ్వుతూ అన్నాడు.

"మీరు బి.యల్. చదివారా? ఎమ్.యల్. చదివారా ?''

అసలు విషయాన్ని ఎలా ప్రస్తావించాలా అని ఆలోచిస్తున్న తన బుర్రకు హఠాత్తుగా తెలివైన ప్రశ్న తట్టగానే తన తెలివితేటలకు వింతో మురిసిపోయాడు హరిముకుందం.

"బి యల్ !'' అని సమాధానమిచ్చాడు నల్లకోటు వ్యక్తి విచిత్రంగా చూస్తూ.

"మీ యిల్లెక్కడ ?''

"రాజుపేట !''

"మీరు యింట్లో ఏఏ సమయాల్లో వుంటారు ?''

"ఎందుకలా అడుగుతున్నారు ?''

"ఆఁ ... మరేం లేదుసార్ ! 'లా'కు సంబంధించి కొన్ని సందేహాలున్నాయి నాకు. మిమ్మల్ని అడిగి సందేహ నివృత్తి చేసుకొందామని...''

"అయితే నేను యింట్లో వుండేది రాత్రి పది గంటలనుండి వుదయం ఏడు గంటలవరకు మాత్రమే !''

విస్తుబోయాడు హరిముకుందం.

"మిగతా సమయం...''

"వృత్తిలోనే గడుపుతాను !''

"వృత్తిపట్ల మీకున్న శ్రద్ధాసక్తులకు నిజంగా అభినందింపతగ్గ విషయం సార్!''

"ఈ మాత్రం దానికి అభినందనలు ఎందుకండి ? మనిషైపుట్టాక ప్రతి వ్యక్తీ కష్టపడాల్సిందే కదా! ఈ కష్ట మంతా మన పెళ్ళాం బిడ్డల కోసమేగా !''

పెళ్ళాం అన్నమాట వినగానే హరిముకుందానికి వీపుమీద కొరడాతో కొట్టినట్టయింది.

"పెళ్ళయ్యే వరకు పెళ్ళాం పరాయిది. పాణిగ్రహణం చేశాక భార్యాభర్తలకు తేడా

ఏముంది? వివాహ బంధంలోని విచిత్రమేమిటో కాని ఆ క్షణం నుంచి యిరువురి మనస్సులు ఏకమౌతాయి. ఒకరి కోసం మరొకరు జీవిస్తున్నామనే తీయని భావన హృదయాల్లో కల్గుతుంది. పిల్లలు పుట్టాక యిద్దరి దృష్టి పిల్లల భవిష్యత్తు మీదే వుంటుంది..." చెప్పుకుపోతున్నాడు నల్లకోటు వ్యక్తి.

'తనేదో విడాకుల గురించి అడిగి తెల్సుకోవాలనుకొంటుంటే ఈయనగారు వివాహ సంబంధం యొక్క విశిష్టత గురించి ఉపన్యాసం యిస్తున్నాడేమిటి చెప్మా?' అనుకొన్నాడు హరిముకుందం తనలో.

"...ఇంతకుముందు మీ కార్మిక నాయకుడు చెప్పాడు గుర్తుందా? కార్మికులంతా ఓ కుటుంబంలాంటి వాళ్ళని, ప్రభుత్వం కుటుంబం పెద్దలాంటిదని — కుటుంబ సభ్యుల శ్రేయస్సుకోరే పెద్దలానే ప్రభుత్వం కూడా కార్మికుల కోర్కెలను, డిమాండ్సును తీర్చాలని చెప్పారు గుర్తుందా? తననే నమ్ముకొన్న కార్మికులకు అన్యాయం చేయటం ప్రభుత్వానికి తగదని హెచ్చరించారు. గుర్తుందా? ఒక్కసారి ఆలోచించండి! ప్రభుత్వ వైఖరి సంగతి అలా పెట్టండి! ముందు మనం మన బాధ్యతలను ఎంతవరకు సక్రమంగా నిర్వర్తిస్తున్నామో ఓ సారి ఆత్మవిమర్శ చేసుకోండి. పేకాట, త్రాగుడు మొదలైన వ్యసనాలకు బానిసలై భార్యా బిడ్డలను క్షోభ పెడుతున్న వాళ్ళు మన కార్మికుల్లో ఎంత మందిలేరు? మన నడతను సరిదిద్దుకోలేని మనకు ఇంకొకరి నడతనుగురించి మాట్లాడేహక్కు వుందా? ఇంకొకరిని సక్రమంగా నడవమని శాసించే అధికారం వుందా? మాట్లాడరే?"

"మీరు చెప్తున్నదంతా నిజమే!" మెల్లగా అన్నాడు హరిముకుందం. "కాబట్టి ముందు మనలో మార్పురావాలి! బాధ్యతలు స్వీకరించాలి! పెళ్ళాం బిడ్డలను పోషించటం కోసం కష్టపడటంలో తప్పు లేదు! మనం నమ్ముకొన్న వృత్తిపట్ల శ్రద్ధాభక్తులు చూపించటం మన విధి! ఒకరి అభినందనలతో మనకు పనిలేదు!"

"అవుననుకోండి! అయినా వృత్తికి అంకితమైపోయి లాయర్లు అందరూ మీలా కష్టపడుతున్నారంటారా?"

"మధ్యలో లాయర్ల విషయం ఎందుకండి?" అన్నాడు నల్లకోటు వ్యక్తి నవ్వుతూ.

"అదేమిటి అలా అంటారు?"

"అవునండి! ఒక్కోసారి ధర్మాన్ని అధర్మమని, హంతకుని నిర్దోషి అని వాదించటానికి సిద్ధపడే ఆ వృత్తి అంటే నాకు అయిష్టత!"

అదిరిపడ్డాడు హరిముకుందం.

"అదేమిటి సార్! లాయర్‌గా పని చేస్తూ ఆ వృత్తిమీద యిష్టం లేదంటారే?" ఈ సారి ఆశ్చర్యపోవటం పరంధామయ్య వంతయింది.

'మీరు పొరబడుతున్నారు! నేను లాయర్‌గా పనిచేయటమేమిటి?"

"మీరు బి. ఎల్. చదివానన్నారుగా!"

పరంధామయ్య పెద్దగా నవ్వేడు.

"'లా' చదివినంత మాత్రాన న్యాయవాద వృత్తినే చేపట్టాలని ఎక్కడుంది? ఉత్సాహం కొద్దీ చదివానని ఎందుకు భావించకూడదు? ఏది ఏమైనా మాటల్లో పడి డాక్టర్‌గారింటికి వచ్చేశాం సుమీ!" అంటూ సైకిల్‌ను ఆపాడు పరంధామయ్య.

హరిముకుందానికి అంతా అయోమయంగా వుంది. పరంధామయ్య ప్రవర్తన వింతగా తోచింది. నల్లకోటు ధరించి డాక్టర్‌గారింటికి వస్తున్న ఈ వ్యక్తి లాయర్ కాదా? మరి యింటి దగ్గర వుండకుండా పగలు ఏడు గంటలు మొదలుకొని రాత్రి పది గంటల వరకు ఈ మహానుభావుడు చేస్తున్న వుద్యోగం ఏమిటి?

"అవును! మీరు అసలు విషయం చెప్పనే లేదు! నేను లాయర్ని కాకపోయినా 'లా' చదువుకొన్నాను కాబట్టి 'లా' గురించి మీకు వచ్చిన సందేహాలను తీర్చగలనన్న నమ్మకం నాకుంది! మీ సందేహాలేమిటి?" పరంధామయ్య కళ్ళజోడు తీసి అడిగాడు.

విడాకుల గురించి వివరాలు తెల్సుకోవాలనే కోరిక పరంధామయ్య ఉపన్యాస సముద్రంలో కొట్టుకుపోయింది.

ఇప్పుడు హరిముకుందం మనసులో మెదులుతున్న సందేహం —

'పరంధామయ్య వృత్తేమిటి?'

ఆత్రం పట్టలేక సూటిగా అడిగేడు.

"మరేం లేదండి! 'లా' గురించి సందేహాల కంటే మరో సందేహం నన్ను వేదిస్తూంది!"

"ఏమిటండి?"

"న్యాయవాదిగా పని చేయటం లేదన్నారు! మరి మీరు చేసే వృత్తి..."

"ఉపాధ్యాయ వృత్తి!"

హరిముకుందం నిశ్చేష్టుడయ్యాడు.

"అయితే మీరు డాక్టర్ గారింటికి వచ్చేది..."



# నల్లకోటు

"వాళ్ళ పిల్లలకు ప్రయివేటు చెప్పటానికి!"

'హరిముకుందంలో ఆలోచనలు చెలరేగాయి. పరంధామయ్య పట్ల గౌరవం పెరగసాగింది. భార్యా బిడ్డల కోసం ఆయన పగలంతా స్కూల్లో పని చేయటమే కాకుండా మిగతా సమయాల్లో విశ్రాంతి లేకుండా ప్రయివేట్లు చెప్తూ ఎంతో కష్టపడుతున్నారని తెలియగానే సిగ్గుతో తల వంచుకొన్నాడు కుటుంబ పోషణ కోసం బాధ్యతలు తెల్సుకొని నడుచుకొంటున్న ఆయన ప్రవర్తన హరిముకుందం మనసులో జ్ఞానదీపికను వెల్గించింది. ఆయన శ్రమతో పోల్చుకొంటే తను పడే శ్రమ ఏపాటిది?' అన్న ప్రశ్న ఉదయించింది హరిముకుందం మనసులో.

"మేస్టారూ! మీరు మరోలా భావించక పోతే ఇంకో ప్రశ్న అడుగుతాను!"

"అడగండి!"

"మరి మీరు ఈ నల్లకోటును ఎందుకు ధరిస్తున్నారు?"

"మంచి ప్రశ్నే వేశారు. కేవలం ఒక్క రోజు జీతం కోత కోసినందుకు, ఇంక్రిమెంట్‌ను ఓ నెలరోజులపాటు వాయిదా వేసినందుకు నిరసనగా మీరు ఆ నల్లటి రిబ్బను ముక్కను ధరించారు కదా? మరి దాదాపు ఆరు నెలల నుంచి జీతాలేలేక జీవచ్ఛవాల్లా ఎయిడెడ్ స్కూళ్ళలో పనిచేస్తున్న నా లాంటి నిర్భాగ్యుడు నిరసనగా ఈ నల్లకోటును ధరించటం తప్పా? వస్తా!" అంటూ మేస్టారు డాక్టర్ గారింట్లోకి వెళ్ళారు.

శీతా కాలంలో అప్పగారికి బాగా ఉపకరిస్తుందని రైల్వే వుద్యోగిగా పనిచేస్తున్న మేస్టారి తమ్ముడుపంపించిన ఆ నల్లకోటు... కేవలం మేస్టారిని చలిబారినుండి రక్షించటమే కాకుండా రాధను విడాకుల బారి నుండి కూడా రక్షించింది...

ఎదురుగా పుష్ప యింట్లోకి వెళ్ళాల్సిన హరిముకుందం సైకిల్‌ను వెనక్కి త్రిప్పి టెలిగ్రాఫ్ ఆఫీసుకు బయల్దేరాడు

ఎందుకో తెల్సా?

భార్యను పంపించమని మామగారికి టెలిగ్రామ్ యివ్వటానికి.

# ఫాలాక్షుని డైరీ

## మొగుడి మీద కోపం ముష్టి పిల్ల బలి!

కలకత్తాలో ఒక సతీ అనసూయకు తన భర్త మీద కోపం వచ్చి మండే ఎండే స్టౌ తీసి ఆయన మీద విసిరి కొట్టిందట. ఇలాంటి సంఘటనలలో పూర్వానుభవం ఉన్న ఆ కేదారాసింగు అతి లాఘవంగా తప్పించుకున్నా కిరసనాయిలు మీద పడి, ఆ మంటలవల్ల ఒళ్ళు కొంచెం ఎక్కువగానే కాలిందట. గురి తప్పిన ఆ స్టౌ సూటిగా వీధి గుమ్మం దాటి నిలబడి ఉన్న ఒక ఎనిమిదేళ్ళ ముష్టి పిల్ల మీద పడి, తన కర్తవ్యం నెరవేర్చిందట. ప్రమాద స్థితిలో ఆ మహా ఇల్లాలు సరస్వతి సింగ్ భర్త కేదారాసింగునూ, ఆ పిల్లనూ ఆసుపత్రిలో చేరిస్తే ఆ పిల్ల చనిపోయిందట.

## మున్సిపల్ అధికార్ల సేవానిరతి

తిరుపతిలో రోడ్లు శుభ్రపరిచే వారంతా విజృంభించి సమ్మె చేయనారంభించినందువల్ల రోడ్లన్నీ పేరుకుపోయాయట. దాంతో మున్సిపల్ ఎడ్మినిస్ట్రేషన్ ఆఫీసర్లు తదితర ఉద్యోగులూ తలకో చీపురు పుచ్చుకుని ఝామున్నే రోడ్ల మీదకు వచ్చేసి ఊరంతాని విసుక్కుపోయినా లెక్క చేయక ఊడ్చిపారేశారట — ఆహా! అపూర్వ మిదమద్భుతం.

### పాకలో కాపురం పెట్టినందుకు బదిలీ:

జయపూరు మెజిస్ట్రేటుగారికి ప్రభుత్వం క్వార్టర్సు యివ్వనందువల్ల ఆయన నేరుగా తన కాపురం ఒక పాకలో పెట్టేశారట. దాంతో రాష్ట్ర ప్రభుత్వం ఇరకాటన పడి ఆయన్ని సమాధాన మేంచేయాలో తెలీక వెంటనే ఆయన్ని జైపూరునుంచి బదిలీ చేశారట. కాల్లో ముల్లు తీయడం కుదరనప్పుడు కాలే తీసేసే దాన్నే వైద్య మందురా! మహాత్మా.

### రెట్టింపు లాభం!

కర్నాటక రాష్ట్ర ప్రభుత్వం హిందుస్థాన్ మెషిన్ టూల్స్ కంపెనీ పోయినేడుకు రెట్టింపు లాభం యీ ఏడు సంపాదించిందట. ఈ సంవత్సరపు లాభాలు 9.66 కోట్ల రూపాయలట.

### భూగర్భ రైలు మార్గం:

యూరప్‌లో పొడుగాటి భూ గర్భ రైలు మార్గం యిటీవల పూర్తి అయ్యిందట. ఈ రైలు మార్గం 12,878 మీటర్లట. ఈ మార్గం ఆల్ప్స్ పర్వతాలగుండా వేయబడినదట.

### అధికారికి 60 మంది భార్యలు!

కామెరూనుకు చెందిన లాంగ్వ గ్రామంలోని గ్రామాధికారిని లంగ్ అంటారట. ఆయా పదవికి కొన్ని సౌకర్యాలున్నాయట. ఆయన ఎన్ని వివాహాలయినా చేసుకోవచ్చునట. ఇటీవల లంగ్ పదవిలో ఉన్నాయన చనిపోయినందువల్ల ఆయన తమ్ముడు ఆ పదవిలోకి రావడమే గాక, అక్కడి సంప్రదాయం ప్రకారం తన అన్నగారి ఆస్తి, ఆయన భార్యలను కూడా పొందాడట. తన భార్యలు, తన అన్నగారి భార్యలు, అనక ఆయన చేసుకున్న వివాహాలూ కలిపి ఆయన కిప్పుడు అరవై మంది భార్యలు ఉన్నారట.

ఆ దేశంలో అరవై మంది భార్యలున్న మగవాడీయనొక్కడేనట. లెటజా టూ గో దట్ కంట్రీ.

### నిష్ఠూరంగా కన్పించే నిజం!

ఒక్కొక్క మంత్రికి జీతం, ఆయనకు సంబంధించిన తదితర వసతులఖర్చులు కలిపి ఏటికి నాలుగున్నర లక్షలు అవుతోందని రాజ్యసభలో జనతాకు చెందిన పీలూమోడీ అన్నారట. మంత్రిగారికే ఏటికి యింత ఖర్చు పెడుతోంటే యిహ సామాన్యుల గూర్చి గాని, తదితరుల జీతాల విషయం గురించి మాట్లాడటం ఏమంత సమంజసం అన్నారటాయన. నిజం కొంత నిష్ఠూరంగానే ఉంటుంది కదటా!

### కన్నడ నటి కల్పన ఆత్మహత్య:

కన్నడ ప్రఖ్యాత నటి కల్పన బెల్గాంకు 22 మైళ్ళ దూరంలో ఉన్న గోటూరు అనే ఊరిలోని పి. డబ్ల్యు. డి. బంగళాలో ఆత్మహత్య చేసుకున్నారట. సంగమేశ్వర నాట్యసంఘ అనే సంస్థతో ఆవిడ నాటక ప్రదర్శనలిస్తూ మే నాలుగో తేదీన తన బృందంతో యీ బంగళాలో దిగారట. 11వ తేది ఉదయం పది గంటల ప్రాంతంలో తనకు ఒంట్లో బాగాలేదనీ, తననెవరూ లేపవద్దనీ చెప్పి తన గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నారట. ఆ రోజు రాత్రి పదిగంటలయినా తలుపు తీసుకు బయటకు రాకపోయే సరికి ఆవిడ సెక్రెటరీకి భయం వేసి పోలీసులకు తెలియజేస్తే వారొచ్చి తలుపు తెరచి చూస్తే పక్కమీద కల్పన నిర్జీవంగా పడి ఉన్నారట. చేతిలో ఒక పుస్తకం, పక్కనో ఉత్తరం ఉన్నదట. కమీషనర్ ఆఫ్ పోలీసు కు వ్రాయబడిన ఆ ఉత్తరంలో తన చావుకు తానే కారణమని వ్రాశారటావిడ. ఎవన్నీ కోర్కెలూ తీరాయని, ఒక కన్నడ సినిమా తీయాలన్న ఆ కోరిక మాత్రం తీరకుండానే తాను చనిపోతున్నందుకు బాధగా ఉందని కూడా ఆ ఉత్తరంలో ఉందట. ఆవిడ చేతికి ఉన్న ఉంగరంలో వజ్రం లేనందువల్ల బహుశా వజ్రం మింగి మరణం కొని తెచ్చుకొని ఉంటారని పోలీసులు అనుమానిస్తున్నారట. అసలు కారణం విచారణలో ఉన్నదట. ఉండదా మరి?



### ఉత్తరాలు : పాఠకులకు మనవి

- ★ ఉత్తరాలు క్లుప్తంగా తెలుగులో వ్రాసి చివర స్పష్టంగా తమ పేరు చిరునామా వ్రాయాలి.
- ★ సంతకాలు పెడితే పేరు అర్థం కాదు కనుక దాని క్రింద పూర్తి పేరు కూడా వ్రాయాలి.
- ★ ఉత్తరాలు తిప్పి పంపమంటూ కొందరు తపాలా బిళ్లలు పంపుతున్నారు. ఉత్తరాలు తిప్పి పంపడం సాధ్యం కాదు.
- ★ వచ్చిన అన్ని ఉత్తరాలు వేయడం ఎప్పుడూ సాధ్యం కాదు. కొన్నింటిని సంక్షిప్తం చేసి వేయవలసి ఉంటుంది. కూడా. ఏ ఉత్తరమైనా వ్రాసేవారి చిరునామాతో కూడా ఉండటం అవసరం. — సం.

# డాక్టరు సలహాలు

**ఎమ్. జె. పి. — ఆలంపూర్**

నాకు అప్పుడప్పుడూ నోటి పూత వస్తుంది. ఇలా రావటానికి కారణమేమిటి? దీనికి నివారణోపాయం ఏమిటి?

ఆహారంలో రిబోఫ్లావిన్ అనే బి కాంప్లెక్స్ విభాగంలోపించటం వల్ల తరచూ నోటి పూత వచ్చే అవకాశం ఉన్నది.

మన ఆహారంలో పాలిష్ చేయబడిన బియ్యం వాడటం వల్ల ఇలా వచ్చే అవకాశం ఎక్కువ.

సగ్గుబియ్యం జావ, దంపుడుబియ్యపుఅన్నము, కొబ్బరిపాలు, కొమంచిఆకు రసం వాడితే త్వరగా నయమవుతాయి.

రిబోఫ్లావిన్, బి—కాంప్లెక్స్ మాత్రలనురోజుకి అరు వంతున వరుసగా ఒక నెలపాటు వాడండి.

**ఆర్. ఎస్. ఆర్. — తిరుపతి**

10 సం.ల వయస్సు గల అబ్బాయికి 5 సం.ల క్రితం టైఫాయిడ్ వచ్చి చెముడు, మూగ వచ్చినవి అతను మామూలు మనిషి అవటానికి అవకాశములు వున్నాయా?

టైఫాయిడ్ వచ్చినపుడు కొందరికి మెదడు, దాని మీద పొరలు వాయటం జరుగుతుంది. ఇలా జరిగినప్పుడు మెదడు నుంచి వివిధ భాగములకు పోయే నరములు దెబ్బతినవచ్చును. ప్రస్తుత వైద్యశాస్త్రరీత్యా, టైఫాయిడ్ వచ్చినపుడు ఈకాంప్లికేషన్‌వల్ల మాట పడిపోవటం తాత్కాలికమని చెప్పినా 5 సం.లు దాటిపోయింది కనుక, 'డెఫ్ అండ్ డంబ్' స్కూళ్లలో చేర్పించినచో కొంతవరకూ పరిస్థితి మెరుగుపడవచ్చును.

**పి. ఎస్ ఆర్. — గుడివాడ**

కొందరు పిల్లలు ఎంత పుష్టికరమైన ఆహారము తీసుకొన్నా వయస్సుకు తగ్గ పెరుగుదల లేక సన్నగా పీలగా వుంటారు. ఇలా వుండటానికి కారణములు ఏమిటి?

పుష్టికరమైన ఆహారం అంటే ఎంతపుష్టి, ఎందులో పుష్టి అనే ప్రశ్నలు వేయాల్సి వస్తుంది. పిల్లల ఆహారాన్ని వయస్సునిబట్టే గాక బరువును బట్టి నిర్ణయించాలి. పిల్లల శరీరానికి కావలసినంత మాంసకృత్తులు, ఇతర పోషకపదార్థాలు, విటమిన్‌లు తగుపాళ్లలో క్రమంగా ఇస్తున్నప్పుడు పిల్లలు ఆరోగ్యంగా వుంటారు. కొందరికి ఇలా చేసినా, సన్నగా, పీలగా వుండటానికి వారి జీర్ణకోశములలోని కొన్ని లోపాలు, కొన్ని బహిర్గతం కాని రోగాలు, ప్రైమరీ కాంప్లెక్సు, మరి కొంతమందికి వంశపారంపర్యంగానూ కొన్ని ముఖ్యకారణాలు.

**కె. ఎస్. — ఖమ్మం**

నా వయస్సు 25 సం.లు. 5 సం.ల క్రితం 'ప్లూరెసీ' వచ్చింది. సంవత్సరమునకొకసారి పరీక్ష చేయించుకుంటున్నాను. చాలా బలహీనముగా వుంటున్నది. 'ప్లూరెసీ' అంటు వ్యాధా? వ్యాయామము చేయవచ్చునా?

'ప్లూరెసీ' అంటే వూపిరితిత్తుల మీద కప్పబడిన పొరవాయటం. ఈరోగం మూడురకాలుగా వుండవచ్చును. పొడిగా వుండేరకం, ఈపొరలమధ్య ద్రవం చేరటం (ఎఫ్యూషన్) ఈ పొరల మధ్య చీము చేరటం (ఎంపయీమా) అనేవి.

ఈ జబ్బు వూపిరితిత్తుల లోపల, సూక్ష్మక్రిములు చేరినపుడు, టి. బి. వున్నప్పుడు, ఛాతీనూ జీర్ణకోశమును వేరుచేయు డయాఫ్రమ్ క్రింద చీము చేరినపుడు, వూపిరితిత్తులు నెత్తురులేమిలేక కాన్సర్‌తో చెడిపోయినపుడు వస్తుంది.

ఈ రోగం స్వతహాగా అంటువ్యాధి కాదు. ఈ రోగ కారణములైన సూక్ష్మక్రిములు ఇతరులలో ప్రవేశించవచ్చును. అయినా ఈ రోగమే రావనవసరము లేదు.

పూర్తిగా నయమయిన తర్వాత మామూలుగా వ్యాయామం చెయ్యవచ్చును.

**ఎమ్. కె. ఎమ్. — బద్వేలు**

మా అమ్మగారికి 2 నెలల క్రితం జ్వరము వచ్చినది, ఆ జ్వరంలో చెవిలో శబ్దములాగా వినిపించింది. జ్వరం వచ్చిన రోజులలో కొన్ని ఇంజక్షన్లు వాడారు. మొదట కుడిచెవి అసలు వినిపించలేదు. తర్వాత 15 రోజులు రెండు చెవులూ బాగా వినిపించినవి ఆ తర్వాత రెండు చెవులలో బాగా శబ్దము అవుతున్నది. రెండు చెవులలో రైలు ఇంజను శబ్దంలాగా టకటం శబ్దం వస్తోంది. ఇ. ఎన్. టి. స్పెషలిస్టుకు చూపిక చగా 'ఎక్సరే' తీసి ఏమీలోపం లేదన్నారు.

చెవులకి ఏదైనా రోగాలు రావటం అంటూ జరిగితే, ఆ రోగం ఎక్సరే తీసినంత మాత్రాన రోగ నిర్ధారణ జరుగుతుందని అనుకోవటం చాలా సహజంగా జరిగేదే. ప్రత్యక్షంగానూ, మరికొన్ని ఆయుధాల ద్వారాను, కొన్ని పరికరాల ద్వారా శబ్దాలను ఒక కాగితం మీద రికార్డు చెయ్యటం ద్వారాను, మరికొన్ని ఇతర పరీక్షల ద్వారా కూడా రోగ నిర్ధారణ తప్పక జరుగుతుంది. కాబట్టి మీరు ఆ ఎక్సరే గొడవ మాని పెద్దపెద్ద వసతులుగల వైద్య కళాశాల ఆస్పత్రులలో చూపించండి. అక్కడ మీకు కావలసిన సహాయం తప్పక లభిస్తుంది.

**వి. వి. బి. — కొల్లిపర**

కేన్సర్ ఎలావస్తుంది? ఆదిలోనే డాక్టరు సహాయం లేకుండా కనిపెట్టవచ్చునా? రాకుండా వుండటానికి ఏమి చెయ్యాలి?

కేన్సర్ రావటానికి ఇదే కారణం అని ఇంతవరకూ తేలలేదు. కొన్ని కారణాలవల్ల రావచ్చును అని మాత్రము అభిప్రాయము వున్నది.

పొగాకు, కోరదంతములు (నోటికి), పొగపీల్చటం (వూపిరితిత్తులకు) మధుపదార్థములు, ఎక్కువ కారము (జీర్ణాశయమునకు) పురుషుల జననేంద్రి

యముల మీద చర్మం ముస్లింములలో లాగ తొల గించినపుడు, ఆడవారి జననేంద్రియముల కు— ఇలా వేర్వేరు భాగాలకు కొన్ని కారణాలవల్ల కేన్సర్ రావచ్చని అభిప్రాయం.

శరీరం మీద కనపడే భాగంలో వచ్చినప్పుడు పేరన్నట్లు డాక్టరు సహాయం లేకుండా కనిపెట్ట గలరేమో శరీరంలోపల వున్నప్పుడు, డాక్టర్లు కూడా ముందరగానే కనిపెట్టటం కష్టమే.

నివారణకు ప్రస్తుతం — ఎక్స్‌రే, కొన్ని మందులు శస్త్రచికిత్స — అవసరాన్నిబట్టి వైద్యులు వాడుతారు.

—డా॥ కె. వెంకటేశ్వరరావు ●

# ఉత్తరాలు

(5 వ పేజీ తరువాయి)

శోభన్‌బాబు—శ్రీదేవి ముఖ చిత్రంతో వెలువడిన 11.5.79 నాటి మా అభిమాన వార పత్రిక ఆంధ్ర సచిత్ర వార పత్రిక అత్యంత ఆకర్షణీయముగా ఉంది.

పందెంలో పైచేయి, కరుణ కథలు చదివాను చాల బాగున్నాయి. ఇది ఒక సాంఘిక, జీవిత మాధుర్యం రెండు సీరియల్ కథలు రసవత్తరంగా ఉంటున్నాయి. ఈ రెండు సీరియల్ కథలు కూడా పత్రికకు ఆణిముత్యాలు.

రచయితలా? ఎం. డి. సౌజన్య గారి కవిత మధురంగా ఉంది. బొమ్మల మహాభారతం లో కిమ్మీరవధ బొమ్మలు చూడ చక్కగా ఉంటున్నాయి. చిత్రకారుడికి నా అభినందనలు.

మంచిమంచి కార్టూన్లు ప్రచురిస్తున్నారు. మా ఇంట్లో అందరికి నచ్చుతున్నాయి.

న్యాయపతి రమేష్‌బాబు, ఉమా శంకరరెడ్డి గంటా, (హైదరాబాద్.)

### పి రి య త్

25. 5.79 నాటి ఆంధ్రపత్రిక వారపత్రిక ముఖ చిత్రం ఎంతో మనోహరంగా ఉండి, అందర్ని ఆకట్టుకుంది. రాగరేఖ సీరియల్ ప్రారంభంలోనే మమ్మల్ని ఆకట్టుకొని మా మనస్సులను దోచుకుంది. ఇది ఒక సాంఘికాల సీరియల్ మా హృదయాలను రంజింపజేయుటయేగాక అత్యంత ఉత్సుకతతో రసవత్తరంగా సాగుతూ ఎక్స్‌ప్రెస్‌లా ప్రయాణిస్తుంది. అంతర్యం కథ చాలా బాగుంది. కథలో కొత్తదనం కోరే పాఠకులకు ఇది హైలైట్. ఈ వారం సినిమా జి. వి. జి. పేజీలలో చాలా విషయాలు తెలియజేసినందుకు మా మనఃపూర్వక ప్రణామాలు అందజేస్తున్నాము.

వై. హేమసుందరరావు, (హేమబిందు.)

* * *

18.5.79 తేది నాటి పత్రిక ముఖచిత్రం నాగేశ్వరరావు పత్రిక గెటప్ వెరీ ఫైన్‌గా ఉంది. జీవిత మాధుర్యం సీరియల్ ముగింపు చాలా బాగుంది. మేము ఊహించినట్లుగా కథ రమ్యంగా ఉంది ముగింపు. ఇది ఒక సాంఘికాల సీరియల్ ఇంటరెస్టుగా సాగుతూంది చదవడానికి. ఈవారం కథలు హాస్యభరితంగా ఉన్నాయి. దేశదేశాల తెలుగు వారి అనుభవాలలో సౌదీ అరేబియా విశేషాలు తెలిపినందుకు ధన్యవాదములు. సినిమా వార్తలు పూతరేకుల్లాగ అందిస్తున్నారు జి. వి. జి. గారు. బాపు చటర్జీతో ఇంటర్వ్యూ మెచ్చుటగా ఉంది. ఈ వారం కార్టూన్స్ మమ్మల్ని కడుపుబ్బ నవ్వించాయి.

కె. రషీదా బేగం, కె. నసీమా బేగం, కె. జాహెదా బేగమ్, కె. మున్నీ అండ్ పర్వీన్. మంజిల్, (కాజాఖాన్.)


డాక్టరుగారూ! నా బొమ్మ పాపకు
కులాసాగా లేదండీ.
కాస్త పరీక్ష చేయండి.


జ్వరం లేదు. కానీ,
కడుపునొప్పితో అవస్థ పడుతోంది.
పాపకు ఎప్పుడైనా
ఉపశమనంగా లేనప్పుడు
వుడ్‌వర్డ్స్ గ్రైప్‌వాటర్
ఉపశమనాన్ని చేకూర్చగలదు.
మా అమ్మకూడా నాకు
దీనినే యిచ్చేది.


IMPORTANT TO MOTHERS
WOODWARD'S CELEBRATED
"GRIPE WATER"
INFANTS' PRESERVATIVE
SHAKE THE BOTTLE BEFORE OPENING



## శ్రీ రోశయ్య ఫిరాయింపు :

రాష్ట్ర విధానపరిషత్తులో ప్రతిపక్ష నాయకుడు, కాంగ్రెస్ సభ్యుడు, శ్రీ రోశయ్య ఇందిరా కాంగ్రెస్‌లో చేరారు. కాంగ్రెస్ సన్నవెళ్ళిపోయి, ప్రజలకు దూరమయినందున తాను కాంగ్రెస్ ఐ లో చేరానని ప్రకటన చేశారు. శ్రీ రోశయ్య మంత్రిఅవుతారని వదంతిగా ఉంది. ఇదిఇలావుండగా రాష్ట్రవిధానపరిషత్తు సభ్యులు శ్రీ ఇ. గోపాలరావు ఇందిరాకాంగ్రెస్ సభ్యత్వానికి రాజీనామా యిచ్చి కాంగ్రెస్‌లో చేరారు. కాంగ్రెస్ అధికారంలో లేనిది. అధికారంలో వుండే సంస్థ నుండి దానిలో ప్రవేశించడం విడ్డూరంగానే వుంది. అధికారంలో వున్న సంస్థలలో వుంటే ఎప్పటికైనా ఏదోపదవి లభించే అవకాశం వుంది.

## హాంబర్గ్‌కు డాక్టర్ జగన్నాధరావు :

34వ అంతర్జాతీయ హోమియోపతి వైద్యుల కాంగ్రెస్ ఈసారి జర్మనీలోని హాంబర్గ్‌లో జరుగుతుంది. ఈ సభలకు భారతదేశం నుంచి 24మంది వున్న ప్రతినిధి వర్గం వెళ్ళుతుంది. ఈ ప్రతినిధులలో ఒక్కరు డాక్టర్ పి. జగన్నాధరావు. ఆయన మే 12వ తేదీన హైదరాబాదు నుంచి బయలుదేరి వెళ్ళారు. దక్షిణభారతానికి ఆయన ప్రతినిధి. ఆయన చర్మకోశ సంబంధ వ్యాధులపై పరిశోధన పత్రం చదువుతారు. తిరుగు ప్రయాణంలో ... వివిధ ముఖ్యనగరాల్లో హోమియోపతి వ్యవస్థలను గురించి పరిశీలిస్తారు. ఇదివరకు ఆయన బ్రస్సెల్స్ [బెల్జియం] లో జరిగిన అంతర్జాతీయ హోమియో సభలకు కూడా హాజరయి, పరిశోధనా వ్యాసం చదివారు.

## గోలకొండ పత్రిక పునరావిర్భావం :

కొంతకాలంగా ఆగిపోయిన గోలకొండ పత్రిక సాయంపత్రికగా మే రెండవవారంలో అవతరించింది. ముఖ్యమంత్రి డాక్టర్‌చెన్నారెడ్డి పత్రికను ఆవిష్కరిస్తూ, సమాజంలో పరిణామాలననుసరించి బాధ్యతాయుత పాత్ర నిర్వహించలేని పత్రికలు ఎంతోకాలం

## హైదరాబాదు నోట్‌బుక్

మనజాలవన్నారు. ప్రజాజీవన ప్రవంతి గంగానది వలె పరవళ్ళు తొక్కుతూ ముందుకు సాగిపోతూనే వుంటుందని, పత్రికలు తమ కర్తవ్యం సరిగా నిర్వహించనంత మాత్రాన ప్రజాజీవన ప్రవంతి ఆగదని ఆయనవక్కాణించారు. ఆవిష్కరణోత్సవానికిరాష్ట్ర విధానసభ సభాపతి శ్రీ దివి కొండయ్యచౌదరి అధ్యక్షత వహించారు. సంపాదకుడు శ్రీ నాగ జీరావు కృతజ్ఞత తెలిపారు.

## ప్రథమ భారత స్వాతంత్ర్యసమరయోధులు:

ప్రథమ భారత స్వాతంత్ర్య సమరం 122వ వార్షికోత్సవం మే 10వ తేదీన శాలిబండలో ఆర్య సమాజ యాజమాన్యాన జరిగినప్పుడు ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి ప్రసంగిస్తూ ఆ మహా వీరులు నెలకొల్పిన సత్సంప్రదాయాలను అందరూ ముఖ్యంగా యువకులు పాటించాలని ఉద్బోధించారు. నిజాం నిరంకుశపాలన నుంచి ప్రజల విముక్తికి ఆర్యసమాజ ఎన్నో రాజకీయ రాద్యమాలకు నిర్వహించిందని ఆయన ప్రశంసించారు. అధికార భాషా కమీషన్ అధ్యక్షుడు శ్రీ వందేమాతరం రామచంద్రరావు తమ ప్రసంగంలో ఆనాటి స్వాతంత్ర్య యోధుల ఒక్కొక్కరి పాఠ్యపుస్తకంలో చేర్చాలని సూచించారు. మాజీమంత్రి శ్రీ రామచంద్రరావు కల్యాణి అధ్యక్షత వహించారు.

## ఆరాధన పత్రిక గౌరవ సంపాదక వర్గం :

రాష్ట్ర దేవాదాయ ధర్మాదాయశాఖ ప్రచురించే ఆరాధన మాసపత్రికకు దేవాదాయ ధర్మాదాయ శాఖ కమీషనర్ శ్రీ ఎం. చంద్రమౌళిరెడ్డి గౌరవ సంపాదక వర్గాన్ని నియమించారు. ఈ సంపాదక వర్గం మే నెల నుంచి మూడేళ్లపాటు వుంటుంది. సంపాదకవర్గం సభ్యులు వీరు: శ్రీయుతులు ఎం. చంద్రమౌళిరెడ్డి [దేవాదాయ ధర్మాదాయ శాఖ కమీషనర్], పి. వి. ఆర్. శర్మ, తిరుమల రామచంద్ర [పత్రికారచయితలు], శ్రీమతులు డాక్టర్ పి. యశోదరెడ్డి [ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖరీడరు], డాక్టర్ కె. కమల [ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృతశాఖ రీడరు] గౌరవసంపాదకవర్గం అప్పుడప్పుడు సమావేశమవుతూ పత్రిక అభివృద్ధి విషయమై సూచనలిస్తారు.

## 1900 కొత్త బస్సులు :

ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి ఏప్రిల్ 25వ జిల్లా కలెక్టర్ల సమావేశంలో ప్రసంగిస్తూ, గ్రామాలకు రవాణా సౌకర్యం కోసం అదనంగా 1900 బస్సులు వేస్తామన్నారు. ప్రస్తుతం రోడ్డు రవాణా సంస్థకు 6600 బస్సులు ఉన్నవని, అదనంగా మరి 1900 బస్సులు తెప్పిస్తామని ఆయన అన్నారు. ఆల్విన్ మెటల్ ఫ్యాక్టరీలో కొత్త బస్సులు తయారవుతున్నవని ఆయన అన్నారు. అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా, ప్రతి జిల్లా ప్రధాన పట్టణంలోను బాల విహార బాలభవన్‌ల నిర్మాణానికి దాదాపు పది ఎకరాల భూమిని ప్రత్యేకించాలని ఆయన సూచించారు.

## శ్రీ వల్లభాచార్య పంచశతాబ్ద్యుత్సవం :

శ్రీ కృష్ణశుద్ధాద్వైత మత ప్రవర్తకులు శ్రీ వల్లభాచార్యుల పంచశతాబ్ది ఉత్సవం ఏప్రిల్ 22, 23 తేదీలలో సుల్తాన్‌బజార్‌లోని గుజరాత్‌భవన్‌లో వైభవోపేతంగా జరిగింది. శుద్ధాద్వైత జయంతి సమితి, శ్రీ వల్లభ పీఠ సేవాసమాజం యాజమాన్యాన ఈ ఉత్సవం జరిగింది. 22వతేదీ సాయంత్రం శ్రీ గిరిరాజ మందిరం నుండి, సుల్తాన్ బజార్‌లోని విశామోఢ్ గుజరాత్ భవనం వరకు శ్రీ వల్లభాచార్యుల చిత్రపటం ఊరేగించారు. రాత్రి 12 వరకు అష్టాక్షరీ జపయజ్ఞాలు జరిగాయి. 23న శ్రీ కృష్ణశుద్ధాద్వైతం గురించి తెలుగులో వ్రాసిన గ్రంథం ఆవిష్కరించబడింది. ఈ సందర్భంలో డాక్టర్ వారణాసి రామమూర్తి రేణు ప్రసంగిస్తూ తెలుగువారైన వల్లభాచార్యులను గురించి తెలుగు వారికి తెలియక పోవడం విచారకరమన్నారు. శ్రీమతులు పూర్ణిమా బెన్, మధుబెన్ గర్భాపృత్యం మొ॥ లయిన సాంస్కృతిక కార్యకలాపాలు నిర్వహించారు.

## ఉపశ్రుతి :

మొన్న అప్ప జట్టులో వున్నావు. ఇప్పుడు అక్కజట్టులో చేరావేమోయ్ అని అడిగాను నా మిత్రుని మనుమడిని. అవును అక్కయే మిటాయి యిస్తున్నది. అందుకు ఆమె జట్టులో చేరా అన్నాడు కుండబద్దలు కొట్టినట్టు మా వాడు. పాపం వాళ్ళను అంటారేమిటండీ. యథా రాజా తథా ప్రజాః, నాయకులను బట్టే ప్రజలు అని అన్నాడు దరినపోయే దానయ్య.

_ తిరుమల రామచంద్ర




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

# "ఈగిల్ స్నాచ్ గురించి వేరే చెప్పాలా?"






**"ఇది మీతో వచ్చేందుకు సిద్ధం...!"**
ఎక్కడికైనా సరే!

**"ఇది ఎంతో అనువైనది..."**
దుమ్మును ఏమాత్రం లోనికి పోనివ్వదు...24 గంటలకు పైగా వేడిని ఏమాత్రం బయటికి రానివ్వదు.




**"మరేమిటనుకున్నారు,**
**ఇది ఈగిల్ వాక్యూమ్ ఫ్లాస్క్."**




**ఈగిల్ శ్రేణిలో 123 వేర్వేరు నమూనాలు.**

CASE-111-244-TEL

